ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్

రిజిస్టర్డ్ కార్యాలయం
3-6-272, హిమాయత్ నగర్
హైదరాబాద్ 500 029 (ఆం.ప్ర.)

ఇతర కార్యాలయాలు
బొంబాయి కలకత్తా మద్రాసు కొత్త ఢిల్లీ
బెంగుళూరు హైదరాబాద్ పాట్నా
గౌహతి లక్నో భువనేశ్వర్


ISBN 81 250 0087 9

ప్రచురణ
ఓరియంట్ లాజ్మన్ లిమిటెడ్
3-6-272, హిమాయత్ నగర్, హైదరాబాద్ 500 029

టైప్‌సెట్
కిరణ్ గ్రాఫిక్స్, ముషీరాబాద్, హైదరాబాద్ 500 020

ముద్రణ
ట్విన్ సిటీస్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్ హైదరాబాద్

# మా మాట

సాహిత్యం వెన్నెల బాటయితే కృష్ణశాస్త్రి కవిత ఆ మార్గాన పరుగులు తీసే వెండి రథం. ఆయన కలం వెలార్చిన ప్రతి కవిత ప్రతిపదం మీ ముందుకు తేవాలనే మా ప్రయత్నంలో అముద్రితాలైన అరుణరథం, కొత్తకోవెల, బదరిక, మూగనయాక, విద్యాపతి మొదలైన వాటి ప్రచురణలలో మేం రవ్వంత ఇబ్బంది పడిన మాట వాస్తవం. ఎలా అంటే ఈ వ్రాతప్రతులు ఎప్పుడో ట్రంకు పెట్టెల్లో భద్రపరచడం వల్లనూ, కాగితాలు పాతవై పోయి పట్టుకుంటే చిరిగిపోయే శిథిలావస్థలో ఉండడం వల్లనూ, ఇంకు పెన్నుతో రాయడంతో కొన్ని అక్షరాలు చెరిగిపోవడం వల్లనూ, కొన్ని అసంపూర్ణంగా వదిలేసి ఉండడం వల్లనూ మాకు ఇబ్బంది కల్గింది. అందువల్ల వాటిని భావం మారకుండా, అర్థవంతంగా ఉండడంకోసం కొన్ని చోట్ల మార్పులు, చేర్పులు చేయవలసి వచ్చింది.

అసలు వీటన్నిటినీ సంకలనం చేసి, సంపాదకీయ బాధ్యతలను చేపట్టి ఉత్తరాల ద్వారా మాకు సలహాలు, సూచనలు అందజేసిన బాలాంత్రపు నళినీ కాంతరావు గారికి మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ప్రూఫులు దిద్దడంలో మాకు సహాయాన్నందించిన బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు గారికీ, ఇస్మాయిల్ గారికీ మా ప్రత్యేక కృతజ్ఞతలు. మిగిలిన పుస్తకాల కంటే ఈ పుస్తకాల ప్రచురణలో మేం కొంచెం ఎక్కువ శ్రమే పడవల్సి వచ్చింది. అయినప్పటికీ ఈ పుస్తకాలు మీ ముందుకు తేగలిగిన ఆనందం ముందు అది తక్కువే అన్పిస్తుంది. నిజానికి కృష్ణశాస్త్రి లేని లోటు కొట్టొచ్చినట్టు కనిపించింది. ఆయన వెండిరథాన్ని ఒడిదుడుకులు లేని బాటలో నడిపించాలని మేం చేసిన ఈ ప్రయత్నంలో మీకుగానీ ఇబ్బంది కల్గితే అదికేవలం రథసారథి లేకపోవడంవల్ల మాత్రమేనని సాహితీ ప్రయాణీకులకి వినయపూర్వకంగా విన్నవించుకుంటున్నాం.

ఓరియంట్ లాజ్మన్

# ముందు మాట

కృష్ణశాస్త్రిగారు గుర్తుకు వచ్చినప్పు డల్లా ఆయనే ఎక్కడో ఎప్పుడో ప్రస్తావించిన దృశ్యం నా మనస్సులో బొమ్మ కడుతుంది. కవిత్వం రాయటం ప్రారంభించిన తొలిరోజుల్లో, అంటే డెబ్భై ఏళ్ల క్రితం, ఒక అర్ధరాత్రి సామర్లకోట ప్లాట్‌ఫాం మీద ఈయనా, నండూరి సుబ్బారావు తారసపడ్డారట. నువ్వేం రాస్తున్నావు? అంటే, నువ్వేం రాస్తున్నావు? అని కుశల ప్రశ్నలు వేసుకుని, ఒకరి గేయా లొకరికి వినిపించి, సుబ్బారావు రైలు ముందు రాగా, ఆయన్ని రైలెక్కించి, తన రైలు కోసం ప్రతీక్షిస్తూ దీపస్తంభపు క్రీనీడలో పిట్టలాగా ముడుచుకు కూచున్నానని రాశారు శాస్త్రిగారు. ఒంటరితనంతో బరువెక్కిన ఈ చిత్రం ఆనాటి కృష్ణశాస్త్రికి ప్రతీకగా నాకు తోస్తుంది.

ప్రతి మనిషీ తన అస్తిత్వ కేంద్రంలో ఒక మహాశూన్యంతో పుడతాడు. ఆ శూన్యాన్ని బహిఃప్రపంచంతో, ప్రాపంచిక సౌందర్యంతో, తత్ఫలితమైన ఆనందంతో నింపగలిగే శక్తి, సాధనా బహుకొద్దిమంది సృజనకారులకు ఉంటుంది. మానవ జన్మకు శాపమైన ఆ శూన్యాన్ని కృష్ణశాస్త్రిగారు అద్భుత, సౌందర్యమయ ప్రపంచంతో నింపారు. ఆత్మస్వేచ్ఛకీ, సృజన శక్తికీ ప్రతీక అయిన ఊర్వశిని ఆ శూన్యంలో నిలిపారు.

ఈ తపస్సూ, అన్వేషణా ఒకనాటివి కావు. 'కృష్ణపక్షం'లో ప్రకృతితో తాదాత్మ్యంతో మొదలై, ఆత్మకీ, స్వేచ్ఛకీ, అద్వైతాన్ని తెలుసుకుని, సౌందర్యాన్వేషణలో పండి, ప్రేమకై తపించి, విరహాగ్నిలో కాగి, లోకం చేత నిరసింపబడి, ఆత్మదైన్యంతో

క్రుంగి; తరవాతి కావ్యమైన 'ప్రవాసం'లో అన్వేషణ తీవ్రతరం కాగా, దుఃఖంతో నిర్వేదంతో ఐక్యం చెంది, చివరికి 'ఊర్వశి' కావ్యంలో స్వేచ్ఛకీ, సౌందర్యానికీ, ప్రేమకీ, కవి సృజన శక్తికీ సంశ్లేష మూర్తియైన ఊర్వశిని సాక్షాత్కరింప చేసుకున్నారు. తనలోని మౌలిక శూన్యాన్నించి కృష్ణశాస్త్రి సాగించిన ఈ అన్వేషణ, దుఃఖమూ, నిర్వేదమూ సాధనాలుగా, చివరికి ఊర్వశీ మూర్తిని అందుకుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వం రెండు ప్రవాహాల సంగమం. ఒకటి భాషకి సంబంధించింది. రెండోది ఆలోచనకీ, వ్యక్తిత్వానికీ సంబంధించింది. తెలుగు భాషా, దాని నుడికారపు సొంపులూ తరతరాలుగా ఆయన వంశీయుల రక్తంలో జీర్ణమై పోయాయి. నాలుగు వందల యేళ్ల నించి వారి పూర్వీకులు పిఠాపుర సంస్థాన కవులూ, పోషితులూనూ. వారి నాన్నగారు తమ్మన్న శాస్త్రిగారూ, పెదనాన్నగారు సుబ్బరాయ శాస్త్రిగారూ గొప్ప పండితులూ, కవులూ. వారి వద్ద స్వయంగా భారత, భాగవతాదులూ, ప్రబంధాలూ చదువుకున్నారీయన. శాస్త్రిగారికి ఇష్టతముడైన కవి నన్నయ్యభట్టు. తరవాత తిక్కన. ఆ తరవాత రామకృష్ణుడు. శబ్దప్రయోగం, కవిత్వ శైలుల విషయంలో ఈయన నన్నయ నించి నేర్చుకున్నది చాలా ఎక్కువ. "శబ్దానికి ప్రాణమే కాదు, పక్షాలూ ఉన్నాయి. ఒక శబ్దాన్నీ మరొక శబ్దాన్నీ ఒక ధోరణిలో కలిపి, ఒక విలక్షణమైన గానం పుట్టించి, దాని రెక్కల మీద కూర్చోబెట్టి, ఎట్టి దూరానుభవాలనైనా అందజేసి, ఎట్టి దూరలోకాలనైనా కనపరచి విహరింపజేస్తూ ఇంకా వెనకాల నున్నవేవో స్ఫురింపజేసే శక్తి ఒకటి ఉంది. అది నన్నయది. శబ్దం పలకడమే కాదు పాడుతుంది," అంటారీయన.

శబ్దం చేత పాడింప జేసే నైపుణ్యం ఈయన నన్నయ దగ్గరే నేర్చుకున్నారు. శాస్త్రిగారికి పాటంటే మోజు. మాటకు లేని శక్తి పాట కుందని ఈయన నమ్మకం. ఈయనంటారు: "పాటకు ఒక శక్తి ఉంది. మాటల కందని వాటిని చెప్పుతుంది. ఏ అనుభవమైనా, తన్మయత్వం దాకా తీసుకుని పోయేటప్పటికి మనం దానిని వ్యక్తపరచడానికి సంగీతాన్నో, దాని ఆభాసాన్నో సాయంగా తీసుకుంటాము.. ఇక మహాకవికి మామూలు దృశ్యాలను మించినవి సాక్షాత్కరిస్తాయి గదా! మామూలు ఆవేశాలని మించినవి ఊగిస్తాయి గదా! వాటిని ప్రకటించడానికి సామాన్య శబ్దాలూ, ఎక్కడెక్కడి మాటలూ ఏరి తెచ్చి వాటిని రకరకాల కూర్పుల్లో పెట్టి, చిత్రచిత్రాలుగా నడిపించి, ఒక వింత గానం పుట్టించి, తనకు సాక్షాత్కరించిన దాన్ని మనకు కూడా ప్రత్యక్షం చేయడానికి ఆయన ప్రయత్నిస్తాడు. ఈ శక్తి నన్నయకున్నట్లు ఆంధ్రకవులలో ఎవరికీ లేదు."

కృష్ణశాస్త్రిగారి కవితాశైలి మీదా, పద్యం, పాటా నడిపించే ఒడుపు మీదా నన్నయ ప్రభావం మిక్కుటంగా ఉన్నట్టు తోస్తుంది.

* * *

కృష్ణశాస్త్రిగారి కవిత్వంలోని రెండో వాహిని ఇంగ్లీష్ విద్యాసంస్కారం. ముఖ్యంగా బ్రహ్మర్షి రఘుపతి వెంకటరత్నం నాయుడిగారి వద్ద అధ్యయనం చేసిన ఇంగ్లీష్ రొమాంటిక్ కవిత్వమూ, సూఫీ కవిత్వమూ, రవీంద్రుని కవితార్ణవమూ.

పద్దెనిమిదో శతాబ్దం చివర ఫ్రెంచి తాత్త్వికుడు రూసో భావాల నించి అంకురించిన రొమాంటిక్ ఉద్యమం వ్యక్తి స్వేచ్ఛని ప్రాతిపదికగా తీసుకుంది. మనిషి సహజంగా మంచివాడు, సమాజం

వల్ల చెడతాడు; సమాజం కన్నా వ్యక్తి ముఖ్యం, వ్యక్తి స్వేచ్ఛ పునాదిగా లేని సామాజిక నియమాలకు తలవంచనఖర్లేదు అని వీరంటారు. ఈ ఉద్యమం మౌలిక మానవ స్వభావంలోనే గొప్ప మార్పు తీసుకు వచ్చినట్లుంది. అంతవరకు మహత్తర మానవశక్తిగా కొలిచిన బుద్ధిని (reason) పదవీచ్యుతం చేసి, ఇంద్రియానుభూతిని (sensibility) సింహాసనం ఎక్కించారు. విశ్వాన్ని నడిపించే అదృశ్య శక్తుల్ని ఇంద్రియానుభూతి, లేదా చేతన, ద్వారానే తెలిసికోగలమని వీళ్లు ఖచ్చితంగా నమ్మారు. మానవ ప్రకృతికీ, భౌతిక ప్రకృతికీ సన్నిహితాలూ, సమాజానికి అతిరిక్తాలూ ఐన భావోద్రేకాన్నీ, వ్యక్తి చేతననీ వీళ్లు పైకెత్తారు.

వ్యక్తి స్వేచ్ఛ అంటే మనిషి తన స్వధర్మాన్ని వ్యక్తపరచ గలగటమే. ప్రేమా, ప్రకృతితో తాదాత్మ్యమూ ఈ స్వేచ్ఛ యొక్క అభివ్యక్తులే. ఆత్మస్వేచ్ఛా, ప్రేమా, తాదాత్మ్యమూ అన్నీ ఒక్కటే. వేరు వేరు కావు. తన స్వధర్మాన్ని అన్వేషించటం, దాన్ని వాస్తవీకరించు కోవటమూ, ఇవి రెండూ కృష్ణశాస్త్రిగారి కవితా ప్రస్థానంలో ముఖ్యాంశాలు. తన ఆత్మాభివ్యక్తికి ప్రతీక, ఐన ఊర్వశిని సాక్షాత్కరించుకోవటంతో కృష్ణశాస్త్రిగారికి చివరికి తపస్సిద్ధి కలిగింది.

* * *

అగ్నిపర్వతం మరిగి మరిగి, సెగలు వెళ్ళగక్కి చల్లారాక, వర్షాలు కురిసి నిర్మలాకాశాన్ని ప్రతిఫలించే సరస్సుగా మారి, అందమైన పద్మాల్ని వికసిస్తుంది. కృష్ణశాస్త్రిగారి తరవాతి రచనలైన పాటలూ, యక్షగానాలూ, రేడియో నాటికలూ అటువంటివి. ఆత్మమథనం, అన్వేషణా, సమన్వయం కోసం సంఘర్షణా, ఏవీ లేవు. భాషతో, సంగీతంతో పదాల సొగసులతో, వంపులతో అభినివేశం ఒక్కటే

మిగిలింది. తెలుగు కావ్య సంప్రదాయానిదే పై చెయ్యి. నన్నయా, తిక్కనా, రామకృష్ణుడూ దగ్గరివారయారు.

కవిత్వానికీ, సంగీతానికీ సన్నిహిత సంబంధం ఉందని శాస్త్రిగారి అభిప్రాయం. కవిత్వం సంగీత స్థాయికి ఎదగా లంటారు. సంగీత మంత భావస్ఫోరకంగా ఉండాలంటారు. "కవిత్వంలో శబ్దం పలకడమే కాదు - పాడుతుంది. వచన కావ్యానికీ, పద్యకావ్యానికీ ఉన్న తేడా గమన తీవ్రతే అంటాడు - మిడిల్ టన్ మర్రే. ఈ గమన తీవ్రత సాధించ డానికే పద్య నిర్మాణంలో శబ్దాలను మరీ సార్థకంగా ఏరడం, మరీ బిగువుగా చేర్చడం, వింత వింత ఛందస్సులలో కూర్చడమున్నూ. భావ గీతం వంటి పద్యకావ్యం దగ్గిరికి వెళ్లేటప్పటికి శబ్దం పాటే అయిపోతుంది. 'కవిత్వం శబ్దరూపంలో ఉన్న గానం' అని దీనినే అన్నాడు కార్ లైల్."

ఇంకా ఇలా అంటారు: "మంచి పాటలు వ్రాసేవాడికి, నిజమైన పాట వ్రాసేవాడికి లోపల కూడా అంతరంతరాల్లో సంగీతం వచ్చి ఉండాలి. ఏ అనుభూతికి ఏ రాగమో, ఏ వరసో ఏ విరుపో, ఎక్కడ ఏ నొక్కో, ఏ ఒదుగో, సరిగా మాటా అవీ కలిసి వస్తాయి. నే ననుకుంటాను,గేయానికి ఎక్కువ నగలు తొడగకూడదని - శబ్దార్థాలంకారాలూ అవీ! వాటి బరువు పాటని ఎగరనివ్వదు. లోతులకు రివ్వుమని దిగనివ్వదు."

ఎన్ని రకాల పాటలు రాశారో శాస్త్రిగారు. తెలుగు ప్రపంచ మంతా, తన పొలాలతో, గట్లతో, కాలవలతో, పాటక జనంతో, పిల్లలతో, స్త్రీలతో, వాళ్ల ఆనందాలతో, ఆశలతో, దుఃఖాలతో వాటిల్లో ప్రతిఫలిస్తుంది. తెలుగు ఇళ్లల్లో, వీధుల్లో, పెళ్లిపందిళ్లల్లో, చేలల్లో, తోటల్లో, కాలవగట్ల మీదా యుగయుగాలుగా నిగ్గు తేరిన

పదాల, జావళీల నుడికారపు అందం, మలపుల సొగసూ, విరుపుల ఒయ్యారమూ ఆయన పాటల నిండా విరిసి మనల్ని అలరిస్తాయి. క్షేత్రయ్య తరవాత ఇంతటి గేయకారుడు రాలేదని నా అభిప్రాయం.

* * *

కృష్ణశాస్త్రిగారి పద్యం కన్నా గద్యమే గొప్పగా ఉంటుందని పద్మరాజుగారు అంటుండేవారు. చాలా మంది గొప్ప కవుల గురించి ఇటువంటి రిమార్కులు వింటుంటాం. నిజానికి, కవైన వాడికి గద్యం, పద్యం రెండూ ఒకటే.

శాస్త్రిగారి గద్యరచనలు చాలా మట్టుకు రేడియో కోసం రాసినవి. వీటి వైవిధ్యానికి అంతు లేదు. సాహిత్య విమర్శ మొదలు బామ్మగారి ముచ్చట్ల వరకు అన్ని జీవిత కోణాల్నీ స్పృశిస్తాయి.

ఎందుకంటే, కృష్ణశాస్త్రిగారి గుండెల్లో అందరికీ, అన్నిటికీ చోటుంది. నేను మానవతా వాదిని, వట్టి హృదయవాదిని అని తరచూ అంటుండేవారు. ఇది ముమ్మాటికీ నిజం. ఆయనలా అరమరికలు లేకండా జనాన్ని ప్రేమించిన వాళ్లని నేను చూడలేదు. ఎల్లప్పుడూ ఆయన చుట్టూ జనం ఉండవలసిందే, ఆయన కబుర్లు చెబుతుండాల్సిందే. గొంతుక ఆపరేషనై, స్వరపేటిక తీసేశాక కూడా ఆయన నోట్ బుక్కుల ద్వారా సంభాషణ సాగించేవారు. ఇటువంటి నోట్ బుక్కులు కొన్ని వందలో వేలో పోగయాయి.

ఇంత కరుణార్ద్ర హృదయం ఏ వరం వల్ల సిద్ధిస్తుంది? అని ఆశ్చర్యపడుతుంటాను అప్పుడప్పుడు. ఆయనే అంటాడు: "బాధ వరం. బాధకి చాలా శక్తులున్నాయి. బాధలో కాలిపోయేవాడు పాషాణం కాలేడు... బాధ దృష్టిని నిశితంగా చేస్తుంది. దయార్ద్రంగానూ చేస్తుంది. వేదనలో వేగిపోయేవాడు బాహ్యవిశ్వంలోకీ, మానవ

ప్రకృతిలోకీ చొచ్చుకొని పోయి లోపల లోపల పెల్లగించిచూస్తాడు.. అప్పుడొక విధమైన అనుకంప కలుగుతుంది; ఒక విశ్వజనీన బాంధవ్యం ఏర్పడుతుంది... వేదన వల్ల గాని ప్రేమ కలగదు. ఈ రెండూ కలిస్తే కరుణ అవుతుంది. ఈ రెండూ కల హృదయం సదా స్నిగ్ధం."

"అలాగే కావ్య కల్పనలో కూడా. ఏ కావ్య సృష్టికయినా ఈ కరుణే కారణం.. కనుక, ఈ విశ్వ ప్రేమ - ఈ కరుణ కావ్య నిర్మాణానికి కారణమౌతుంది. అంతే కాదు.ఈ విశ్వప్రేమను, కరుణను ఇతరుల హృదయాలలో కలిగించడమే కావ్యానికి ముఖ్యోద్దేశమని కూడా తత్త్వవేత్తలంటారు."

"నిందించడానికీ, కీర్తించడానికీ కాదు. మానవుని మానవునిగా చేయడానికే కావ్య నిర్మాణం.

" ఈ అనుకంప ఎంత లోపల ఉంటే అంత మానవత్వం మానవుల్లో ఉన్నదన్నమాట. దానిని ఎంత ప్రభవింప చేస్తే అంత గొప్పదన్నమాట ఆ కావ్యం!"

"అటువంటి కావ్యాలు చదివి ఆ విశ్వప్రేమ తాత్కాలికంగా అనుభవిస్తున్నప్పు డయినా, ఆ దయా విధానంలో అందరూ అత్యవసరమేనని గ్రహించుకుంటాం. దాని వల్ల లోకంలో ద్వేషం కరిగిపోతూ ఉంటుంది."

ఇదీ కృష్ణశాస్త్రిగారి కవిత్వ తత్త్వం.

'కృష్ణశాస్త్రి బాధ - ప్రపంచం బాధ; ప్రపంచపు బాధ శ్రీ శ్రీ బాధ' అన్న చలం మాట అర్ధసత్యం మాత్రమే!

కాకినాడ ఇస్మాయిల్

30.10.93.

# విజ్ఞాపన

"మొట్టమొదటిసారి నేను కృష్ణశాస్త్రి వ్రాసిన 'అబ్బ!'[1] అనే పద్యం ఏదో పత్రికలో చదివాను. చదివి 'అబ్బ!' అనుకున్నాను. అటు తరువాత కృష్ణశాస్త్రి రచన ఏది చదివినా, అతని ప్రసంగం ఏది విన్నా 'అబ్బ!' అనిపిస్తూనే ఉంది." అన్నారు శ్రీ విశ్వనాథ సత్యనారాయణ ఒక సాహిత్య సభలో[2]. కృష్ణశాస్త్రి ప్రసంగం అనంతరం తాను ప్రసంగం ఆరంభిస్తూ.

కృష్ణశాస్త్రి రచనల పట్ల ఒక 'విశ్వనాథ' ప్రతిస్పందన మాత్రమే కాదు ఇది. తెలుగు రసజ్ఞ లోకం అంతటి ప్రతిస్పందననే 'విశ్వనాథ' ఆనాడు ఆ విధంగా అభివ్యక్తం చేశారు. ఆది నుంచీ కృష్ణశాస్త్రి పద్యాలు, ప్రసంగాలు, చివరికి సినిమా పాటలూ కూడా తెలుగు రసజ్ఞలోకం చేత 'అబ్బ!' అనిపిస్తూనే వచ్చాయి.

ఇప్పుడు - ఇవి కృష్ణశాస్త్రి శ్రవ్యనాటికలు ఆకాశవాణి వివిధ కేంద్రాలనుంచి ప్రసారితమైనవి. నిజానికి ఈ నాటికలలో దేనికదే విలక్షణమైంది. అయినా స్థూలంగా - దేశభక్తి ప్రధానమైనవీ, భక్తి రసప్రధానమైనవీ, శృంగార ప్రధానమైనవీ అని మూడు వేర్వేరు

---

1. చూ.కృష్ణపక్షం - పుట 50, ఓరియంట్ లాజ్మన్ ప్రచురణ, 1992
2. 1945 ప్రాంతంలో ఏలూరులో సాహిత్య మండలి వారి ఆధ్వర్యంలో జరిగిన సభ అది. చుండూరి వారి సత్రం ఆవరణలో ఏర్పాటు చేసిన బ్రహ్మాండమైన ఆ సాహిత్య సభలో యెంకి పాటల మహాకవి శ్రీ నండూరి సుబ్బారావుగారు ఆ నాటి వర్ధిష్ణు కవి శ్రీ కొనకళ్ల వెంకటరత్నాన్ని సన్మానించారు. ఆ సభకు అధ్యక్షులు, శ్రీ తల్లావఝుల శివ శంకర స్వామి; వక్తలు : కృష్ణశాస్త్రి, విశ్వనాథ, శ్రీ శ్రీ, సభా సంచాలకుడు బి.వి. సింగరాచార్య.

సంపుటాలుగా వెలువడుతున్నాయి. ప్రతి సంపుటంలోనూ మొదటి నాటిక శీర్షికే ఆ సంపుటానికి శీర్షిక అయింది.

దృశ్య నాటికకు ఉన్నన్ని హంగులు శ్రవ్య నాటికకు ఉండవు. రంగస్థల ప్రసాధనం, పాత్రల ఆహార్యం, నటీనటుల ఆంగికాభినయం, హావభావ ప్రకటనా – అన్నీ 'సాహిత్యం' ద్వారా కవి సమర్పించే రస, భావాదులకు దృశ్య నాటికలో దోహదం చేస్తాయి. 'సాహిత్యం' పని సులువవుతుంది. శ్రవ్య నాటికలో అలా కాదు. పాత్రల పరిచయం, శ్రోతల మనస్సులో రంగస్థల భావనా ప్రకల్పనం వంటివి అన్నీ సంభాషణల ద్వారానే – ధ్వనుల ద్వారానే సాధించాలి. ఒక వంక ఇన్ని అదనపు పనులు నిర్వహిస్తూనే 'సాహిత్యం' మరొక వంక శ్రోతల మనస్సులలో రసభావాలను ఉద్దీపితం చేయాలి. శ్రవ్య నాటికా రచన కత్తి మీద సామువంటిది.

అయితే – దృశ్య నాటికకు లేని అదనపు సౌకర్యాలు కొన్ని శ్రవ్య నాటికకు ఉన్న మాట నిజం. క్షణంలో రంగాన్ని భూలోకం నుంచి స్వర్గలోకంలోకి తరలించవచ్చు. కొంచెం విరామ సంగీతంతో క్షణంలో రంగాన్ని ఎక్కడికైనా మార్చవచ్చు. పక్షుల అరుపులు, వాన హోరు వంటి విచిత్ర ధ్వనుల కల్పన ద్వారా చిత్ర విచిత్రాలైన 'ఎఫెక్ట్స్' సాధించవచ్చును. ఈ దృశ్య నాటికలలో సూత్రధారుణ్ణి తీసివేసినా తీసివేయవచ్చును కాని, శ్రవ్య నాటికలో ఒక ప్రయోక్త పాత్ర తరచు అవసరం అవుతూ ఉంటుంది. శ్రవ్య నాటికకు ఉన్న ఇలాంటి ప్రత్యేక అవకాశాలను అద్భుతంగా వినియోగించుకోడం కృష్ణశాస్త్రిగారి ఈ నాటికలలో మనం చూస్తాము.

1940 ప్రాంతంలో విజయవాడ ఆకాశవాణి కేంద్రం నుంచి ప్రసారమైన నాటికలలో కొన్ని పాటలు ఆ రోజులలో యువకవులమైన అస్మదాదులను వెంటాడి, వెర్రెత్తించి, తెలుగు పదాల కూర్పులో ఇంతటి మాధుర్యాన్ని, ఇంత ఇమిడికను – సాధించవచ్చునా అని ఆశ్చర్యపోయేట్టు చేసేవి. అలా ఆ రోజులలో నన్ను వెంటాడిన ఒక పాదం ఇప్పటికీ నాకు జ్ఞాపకం ఉంది.

'ఆషాఢ యోషామణీ కేశపాశాన
అల్లుకొన్నది తటిద్వల్లియో' (శ్రీ విద్యాపతి – పుట 15)

ఇలా ఆ నాడు కృష్ణశాస్త్రిగారి శబ్ద సంయోజన నైపుణి వెర్రెత్తించిన అస్మదాదులలో శ్రీశ్రీ కూడా ఉన్నాడు. కృష్ణశాస్త్రిలాగా పద్యం వ్రాయాలని ఆయన చేసిన తపస్సు ఆయన 'ప్రభవ'లో కనిపిస్తుంది.

సంస్కృత భాషను ఎంత లలితంగా, ఎంత మధురంగా మలచవచ్చునో లీలాశుకుడూ (కృష్ణకర్ణామృతం) జయదేవుడూ (అష్టపదులు) ప్రదర్శించినట్లు, తెలుగు భాషకుగల లాలిత్యాన్ని, మాధుర్యాన్ని, ఇమిడికనీ కృష్ణశాస్త్రి ఆవిష్కరించారు అనే మాట ఆయన శత్రువులు కూడా కాదనలేని నిజం.

ఈ శ్రవ్య నాటికల వ్రాతప్రతులు కృష్ణశాస్త్రిగారి జీవిత కాలంలో తయారైనవే అనడానికి కొన్ని పుటల మార్జిన్ లలో, స్వదస్తూరీతో ఆయన వ్రాసుకున్న నోట్స్ తార్కాణం మచ్చుకి అలాంటి నోట్స్ కొన్ని ఇక్కడ ఇస్తున్నాను.

''రజనీ! కొన్ని పాటలు దిద్దాలి. నీవు జాగ్రత్తగా పరిష్కరించి బ్రాడ్‌కాస్ట్ వెయ్యి!"
(విద్యాపతి - పుట 1)

"ఊరికే పాటలూ, పద్యాలు చూడండి." (దక్షయజ్ఞం - పుట 1)

"అప్పుడు వ్రాసేశానా?" (దక్షయజ్ఞం - పుట 26)

"కట = శ్మశానం; విషగళుడైన కృపాళుడు" (దక్షయజ్ఞం - పుట 27)

"రామానుజులు కంచి వదలి శ్రీరంగం వెళుతాడా? సెలవు తీసికోలేడు"
(ప్రపన్న పారిజాతం - పుట 27)

"మాఅమ్మ పోయిన రోజుల్లో గోవింద రాజుల సుబ్బారావు వ్రాసినట్లు అతని పేర వ్రాసి ఇచ్చాను - అతని కథను అనుసరించి పూర్తిగా ఇది నాదే! One of my best అతనిది ఒక్క అక్షరం లేదు"
(మదన సాయకం - పుట 1)

వ్రాతప్రతులలో అక్కడక్కడ ఒకటి రెండు పద్యాలూ, కొన్ని డైలాగులూ లుప్తం అయినట్లు కనిపిస్తుంది. వాటిని అలాగే వదిలినా కథాక్రమానికి భంగంలేని రీతిలో స్వల్పంగా సవరించడం జరిగింది.

ఒక శ్లోకం వ్రాతప్రతిలో 'సన్నుష్యతి వైదిక' (ప్రపన్న పారిజాతం-పుట101) అని అసాధువుగా ఉంటే, యామునా చార్యులవారి 'స్తోత్రరత్నం'లో ఆశ్లోక పాఠాన్ని చూసి 'సన్నుష్యతి వైదికః కః' అని దానిని సవరించాము.

ఈ శ్రవ్య నాటికలను ఈ విధంగా మూడు సంపుటాలుగా విభజించి ప్రాథమికమైన ఎడిటింగ్ పని అంతా చేసిన వారు నా చిరకాల మిత్రులు, సహవ్రతి శ్రీ బాలాంత్రపు నళినీ కాంతరావుగారు. 'అమర్చి పెట్టిన దాంలో అత్తగారు వేలు పెట్టినట్లు" చివరి దశలో నేను చేసిన స్వల్పమైన పరివస్య.

ఈ నాటికల సంపాదక కార్యంలో ఈ స్వల్ప పరివస్య చేసే అవకాశం నాకు కలిగించిన ఓరియంట్ లాజ్మన్ సంస్థకూ చిరంజీవి దేవులపల్లి సుబ్బరాయ శాస్త్రి (బుజ్జాయి)కీ నేను కృతజ్ఞుణ్ణి"

ఇతిశమ్!

1-9-34/5/1
రామ్‌నగర్,
హైదరాబాదు 500 048.

బొమ్మకంటి
శ్రీనివాసాచార్యులు

## ఇందులోని నాటికలు

శ్రీ విద్యాపతి
చైతన్య లీల
ఊర్వశి
దక్ష యజ్ఞము
ప్రపన్న పారిజాతము
మదన సాయకము

# శ్రీ విద్యాపతి

## మొదటి రంగము

(కలకలము దూరదూరాల నుంచి వినపడుతుంది, రకరకాల వాద్యాలూ వినపడతాయి. దూరాన్నుంచీ వస్తూ, నృత్యం చేస్తూ పాడుతున్నట్లు ఆడ గొంతుకలూ, మగ గొంతుకలూను)

మంజుల వంజుల కుంజ చర న్మద
*కుంజరమా, గరుదంజనమా, యిది?*
క్రొంజిగురుల విరిమంజరి మరువిలు
*శింజానమ? నీ మంజీరమ యిది?*
నవనవ మధు మధు మైరేయములే
*చవులు తవులు పువు సారాయములే!*
అమర ధునీ మృదుఫేనములే లే!
*అప్సరోంగనా గానములే లే!*

అందరూ : హోయి! హోయి ! హోయి !

గిరిధర దాసు : పీతాంబర్! నీ పాట ఏదీ ?

పీతాంబర్ : ఓ! వినండి మా పాట కూడా ! మీ విద్యాపతి పాట బాగుందో, ఇదో?

(పాట ఆతను పాడుతుంటే అందరూ కలుస్తారు. మధ్య మధ్య నవ్వుతూ అరుస్తారు)

*పానపాత్ర బిరడా తీయుమురా !*
*పాత్ర నిండ సారా పోయుమురా*
*ఎంత త్రావినా నిరపాయము రా !*
*ఎంతో సుఖమగు నీ ప్రాయము రా !*

గిరిధర దాసు : భేష్! భేష్! పీతాంబర్! ఏమి కవిత్వమోయి! ఎలాంటి భావం! ఏమి కూర్పు! ఎంత త్రావినా నిరపాయమురా, ఎంతో సుఖమగు నీ ప్రాయమురా! అద్భుతమైన పంక్తు లివి (అందరూ నవ్వుతారు). గొప్ప కవి! గొప్ప కవి! (గొల్లుమంటారు)

**పీతాంబర్** : నువ్వు పాడు చపలా!

**చపల** : *పానపాత్ర యన బ్రతుకే లే ! లే!*
*తేనెసోన యన వలపే లే! లే!*
*ఆన ఆన నిర్జరుడ వవుదులే*
*లోన లోన అమరుడవే లే! లే!*

**అందరూ** : హోయి! హోయి! హోయి!

గిరిధర దాసు : ఆఁ ఆఁ పీతాంబర్, ఆగు మహాకవులు వేంచేస్తున్నారు, విద్యాపతులు!

**పీతాంబర్** : ఓహో! చిత్తం! ఆగాలి మరి, మహాకవులు వస్తూంటే! మహాకవు లంటే అలాగ ఉండాలి కాబోలు! పొడుగుపాటి జుట్టు! పలాచటి పొడుగాటి పట్టు అంగరఖా! అరమోడ్పు రెప్పల కింద దూరపు చూపూ! చందన చర్చలూ, మల్లీమాలలూ చిరునవ్వులూ! ఎంత వింతగా ఉంటే అంతటి

కవులు - అవునా?

గిరిధర దాసు : వెర్రివాడా! ఈ లోకంలో అనాకారంగా ఉన్న దేదీ ఎలా సహించలేడో, తన కావ్యంలో కఠోరంగా ఉన్న దేదీ ఎలాగ సహించలేడో, మహాకవి తన వేష భాషల్లోనూ అంతే!

రాగిణి : తన అంత సుందరంగానూ లోకాన్నంతా చేస్తా నంటాడు! తన హృదయం అంత ప్రేమార్ద్రంగానూ లోకాన్నంతా చేస్తానంటాడు! అంతే కాదండీ?

గిరిధర దాసు : అందుకే విద్యాపతి మిథిల నంతా అలాగ పరవశం చేస్తున్నాడు.

పీతాంబర్ : అతని గీతాలు వింటూ మన కార్యకలాపం పాడు చేసుకుని చెడుతున్నాం అని నేనంటాను. నువ్వో చపలా? నేనే రాజునైతేనే, "అందరికీ తెలిసేటట్టు వ్రాస్తావా లేదా, అర్థ మయేటట్టు వ్రాస్తావా లేదా, పూర్వ పద్ధతినే వ్రాస్తావా లేదా, పగటి వేషాలు మానతావా లేదా?" అనీ ...

అందరూ : ఆగు, ఆగు! ఊరుకో!

విద్యాపతి : (దగ్గిరగా)

రేగు కోర్కెల గుత్తి నా గుండెవలె నెర్ర
నెర్ర నైనది మావి యిగురు గుబురు
మ్రోగు పాటలపేటి నా గళమ్మటు తీయ
తీయ నైనది పుల్గు తెరవ గూడు
ననుచు నూహల డోల నా మనస్సటు పారు
నేరు లైనది గాలి యోర యెరక
ననయు తావుల కోవ నా మన్కియటు సిత
హసిత మైనది మల్లె యలరు తీవ

పొడుపు వాకిలి గవను తల్పులు నడల్చి
కనబడని చేయి యేది విప్పినదో గాని
నాలు గాళల లోపల మూల మూల
అందు చొరబడి పోయినా డామని దొర!

శ్రీఖండ శైల సానువుల నుపవనుల దిగి
ఒదిగొదిగి రా నేల లోలానిలా!
శేఫాలికా రాజి
చిరుత రేకుల జాజి
అర విరియు నలస నయనముల నెటు లెదురరయు!
పరువు లిడి రా వేల లోలానిలా !

కొన్ని గొంతులు : రాణి! రాణి! లక్ష్మీదేవి !

రాణి : ఆహా! చపలా! ఎవరి పాట ఇది?

చపల : మహారాణీ! పాట ఎంత బాగుందో పాడడమూ అంత బాగుంది కదూ!

రాణి : అది మానవ కంఠస్వరం కాదు

చపల : అమ్మా! మాలతీ కుంజం ఇంతవరకు ఎప్పుడూ పాడినట్లు నేను వినలేదు

రాణి : (కలతగా తోచనట్లు) ఏమో!

విద్యాపతి : (ఇంకా దగ్గిరగా)

నాలు గాళల మీరు నీలి చెళుల పారు
నేరులా, దారులా, ఓ కోయిలా!
జవర మల్లియతీవ చివర తావుల కోవ
తల యూచి యూచి చేతులు చాచి పిలిచినా
పరువునా రాజాల నో కోయిలా!

రాణి : (ఆత్రతతో) చపలా! నేను పాద దగ్గిరకి వెళ్లానా? ఆ పాద నా దగ్గిరకి వచ్చిందా?

చపల : ఒకరి దగ్గిరకి ఒకరు వస్తున్నారు. ఇందాకా పాడింది మాలతీ కుంజం, అక్కడిది. ఇప్పుడు పాడింది వెదురు పొద, ఇక్కడిది. ఆ పాట ఇప్పుడు ఇక్కడికి వచ్చింది.

రాణి : (ఏమీ తోచనట్లు) అ దేమో!

విద్యాపతి : (బాగా దగ్గిరగా)

*మొయిలు సీమలగాని పయనింపదే గాలి!*
*ఈ నిరీక్షణ మేల ప్రసవ బాలా!*
*ఒక్క నిముస మ్మురక ఒదిగి నిలువదె యెరక!*
*ప్రాలు మాలిక గాక ఆలపించునె రాక!*
*ఈ నిరీక్షణ మేల, ప్రసవ బాలా!*

(రాణి తెలియకుండానే చివరి చరణం పాడుతుంది)

చపల : మహారాణీ! తమరూ పాడేస్తున్నారు. (నవ్వుతుంది) అమ్మా! మనిషే నమ్మాయి పాడుతుంటు!

రాణి : కాదు.

చపల : ఏ మమ్మా, అలాగ అయిపోయారు! మీ రిక్కడ లేనట్టున్నారు.

రాణి : మానవులు కంఠస్వరంతో పాడతారు. ఆ పాట చెవులకే వినపడుతుంది.

చపల : అంటే?

రాణి : ఎవరైనా కళ్లల్లో గుండెలు పెట్టి పాడతారా? నిలువునా పాటలా గుంటారా? ఏదో చెప్పలేక పోతున్నాను!

చపల : ఔనమ్మా! నాకు తెలిసిపోయింది. మా పీతాంబరుడే ముక్కుతోనూ, గడ్డంతోనూ పాడతాడు. (నవ్వుతూ హఠాత్తుగా ఆగి) అదేమిటి, మహారాణి అలాగ పరధ్యానంగా, విద్యాపతి వెనకాలే వెళ్లిపోయారు!

కొన్ని గొం : అయ్యో! అయ్యో! చిత్రం! మహారాణిని చూడు. అదిగో అదిగో! అనూరాధ! అనూరాధ!

అనూరాధ : (పాడుతూ వస్తుంది దగ్గరగా)

మధూదయంలో మంచి ముహూర్తం
మాధవీ లతకు పెళ్లీ !
మాధవి పెళ్లికి మల్లీ మాలతి
మందారం పేరంటాళ్లు !
కొమ్మ కొమ్మ కొక సన్నాయీ
రెమ్మ రెమ్మ కొక గవాయీ
కొమ్మా రెమ్మా కలిసి మామిడి
గుబురంతా ఒకటే హాయి!

(హాయి! హాయి! హాయి! అని రాణి నిట్టూర్పులు)

నందన మంతా పందిరి యైతే
మసృణ కిసాలయ మండపమైతే
మాధవీ లతకు మాధవ దేవుడు
మంగల సూత్రం కడతాడు

రాణి : (నవ్వుతూ) అమ్మాయీ! నా నగరు ప్రక్కన మాధవీ లత ఉందని నీకు తెలుసా?

అనూరాధ : తెలుసును, తెలియదు కూడా!

రాణి : ఎవరమ్మా నువ్వు? ఈ పాట ఎవరిది?

అనూరాధ : నాదీ, నాది కాదు కూడాను. మీ పేరేమిటి?

రాణి : లక్ష్మి.

అనూరాధ : పేరూ బాగుంది; పేరుకు తగినట్టు నువ్వూ బాగున్నావు. 'నువ్వు' అననా నిన్నూ?

రాణి : (నవ్వుతూ) అనమ్మా, అను! నీ పేరో?

అనూరాధ : నాకు చాలా పేర్లు ఉన్నాయి. 'కవిత' ఒకటి, 'ప్రతిభ' ఇంకొకటి, 'సరస్వతి' మరొకటి.

రాణి : (నవ్వుతూ) అందరూ ఏ మని పిలుస్తారమ్మా నిన్ను?

అనూరాధ : అనూరాధ!

రాణి : ఈ పాటలు ఎవరు వ్రాశారమ్మా?

రాజు : (హఠాత్తుగా ప్రక్కన విద్యాపతితో నిలిచి) వీరు మహాకవి విద్యాపతి, లక్ష్మి!

రాణి : మహారాజా! (ఇంత ఆగి గద్గదికతో తడువుకుంటూ) నమస్కారము!

రాజు : వీరు మా చిన్ననాటి మిత్రులు లక్ష్మి, సహాధ్యాయులు (రాణి నిట్టూరుస్తుంది). లక్ష్మి! వీరిని మన ఆస్థానానికి దయ చేయమని వేడుకుంటున్నాను. (రాణి నిట్టూరుస్తుంది)

రాణి : చిత్తం !

విద్యాపతి : మహాభాగ్యం! సెలవు! (అందరూ వెడతారు)

మధు దాదా : (ప్రవేశించి) అనూరాధ !

అనూరాధ : మధుసూదన్ దాదా!

మధుసూదన్ : పాపం! ఉష్ ష్ ష్ (నిశ్వసిస్తున్నట్లు అని)

*ఏ గాలి కాని తెచ్చెనో గాని ఈ నాడు*
*రాగరంజిత సుమపరాగ మేదో!*
*చిరగాఢ నిద్రలో మొరగు ఈ పాషాణి*
*మరుగు కోరిక ఎంతగా నింక వేసేనో!*

మంచి కలయా, జిలుగు మంచు తెరయా బ్రతుకు
కొంచె మాలోచించదేమో
అంచులే అరసేను, మురిసేను, దావాగ్ని
దరిసేన ఎంత అలసేనో!

అనూరాధ : (బాధతో) దాదా!

మధుసూదన్ : అనూరాధా! రా, పోదాం, ఆశ్రమానికి

## రెండో రంగము

(విద్యాపతి మహాకవి ఆశ్రమం, గ్రీష్మం, ప్రాంగణంలో బాలికలు పాడతారు.
మధుసూదన్, అనూరాధా కొంత దూరాన ఉంటారు)

*ఈ నిదాఘ విదాహ మెందుకో!*
*అందుకో రాని పే రామని గతించెనా!*
*చందనాచల పవన సరణి పయనించెనా!*
*ఒక యింత నిలువదే ఊరించునే గదే*
*వికచ పాటల శిశిర వాసన పదే పదే!*
*ఆరామ వాటి, హృదయాంత రాంతర పేటి*
*కారుకొన్నది ఏటి ఘోర దావానలము!*

(అనూరాధ ఏడుపు వినవస్తుంది)

మధుసూదన్ : అనూరాధా! ఓ అనూరాధా! ఏడుస్తున్నావా తల్లీ! నాకు తెలుసు. ఈ ఆశ్రమవనానికి (గద్గదికతో కలిసిన రోదన ధ్వనితో) గ్రీష్మం వచ్చింది. అనూరాధా! ఏడవకు (అనూరాధ ఏడుపు వినబడుతుంది). అనూరాధా! మనకు వియోగం ఏ దమ్మా? మహాకవి ప్రతిభను వదులుకుంటాడా? పాటనూ వదులుకో లేదు. మహాకవితో ఆశ్రమం కూడా పోతుంది మిథిలకి. అనూరాధా! ఆ క్రొత్త గేయం ఏదీ? (ఇద్దరూ చేరి ఒక చరణం పాడతారు)

తరుణ జీవన ప్రాంగణ
ద్వార తోరణమున నాదిగి
వేళ గాని వేళ చాల
వేగు కనుల పిలుతు వేల!
ఆరని నును మంచు జడుల
నడగి యడగి నిదురించే
పారిజాత సుమ కోమల
పథముల నెటు నడచినావు?
ఏ తోటల తెరువులదో
ఈ పాటల సుమ వాసన?
ఉసు రను నీ పయ్యెర నీ
వసనము కొస లెటు వలచునా!
క్రొన్నన తెలి తేనె అంటు
కొన్నదోయి, అడుగుదోయి
చిన్నెలు దవు దవ్వుల ఏ
పువ్వుల మన్నించెనోయి !
ఈ ఆమని వేగుబోక
విడక మున్నె ఏటి రాక !
ఏ చంచల చంచలాతి
థివో! యిటనే మసలుదువో!

(తుది చరణం పాడుతుంటే విద్యాపతి వస్తాడు)

మధుసూదన్ : అనూరాధా! ఆ అడుగు లెవ్వరివి? మహాకవి వచ్చినట్లున్నారు!

అనూరాధ : మహాకవీ! ఎందుకు వచ్చావు? మా ఆశ్రమంలో వసంతం పోయింది.

మధుసూదన్ : (వారిస్తున్నట్లు) అనూరాధా! అనూరాధా!

అనూరాధ : "ఏ చంచల చంచలాతిథివో, ఇటనే మసలుదువో"

(అని మళ్లీ పాడుతుంటే దుఃఖం వస్తుంది)

విద్యాపతి : అనూరాధా! ఏమిటీ వెర్రి? మధుసూదన్!

ఆరు కాలాలు ఒక్క పే రామనిగ వ
సించు మన ఆశ్రమాంతరసీమ; ప్రేమ
ఎచట మూలమూలల నిండు అచట నుండు
నవనవోన్మిష జ్జీవనానంద లక్ష్మి

అనూరాధ : అందుకే మీరు వెళ్లడము నా కిష్టం లేదు

విద్యాపతి : ఏం?

అనూరాధ : మీరు ఎక్కడ ఉంటే అక్కడే ప్రేమ ఉంటుంది. "ఎచట మూలమూలల నిండు ప్రేమ అచట నుండు నవనవోన్మిషజ్జీవ నానంద లక్ష్మి" కనుక.

విద్యాపతి : అనూరాధా! నీ మనస్సు ఇంకా వికసించాలి; నీ దృష్టి ఇంకా వెలిగించాలి. అప్పుడే నీ పాట మరీ వలపిస్తుంది. మేము వెళ్లాలి. ఆశ్రమవాసం ఆత్మశక్తి సంపాదనకే గాని, కార్యరంగం మాత్రం మానవ సంఘంలోనే ఉండాలి. (గంభీరంగా, గాఢంగా నవ్వుతూ) సరే నువ్వ్వారా! వస్తావా? మధు సూదన్ దాదా!

*శిథిలాశ్రమ మే మౌనులే!*
*మిథిలాపురికే రానులే*
*కథ లన్నీ యిక మారులే!*
*వ్యథ లన్నీ మితి మీరులే!*

అనూరాధా : *పిలుపేదో నిల నీదులే!*
*వలపేదో విడిపోదులే!*
*తుది లేనీ తెరువేనులే!*
*తుద కంతా బరువేనులే!*

విద్యాపతి : మన సంతా వృథా భయములే !
మని కంతా సుధా మయములే !
వన మంతా నందనములే !
కనుమంతా మోహనములే !

ముగ్గురూ : శిథిలాశ్రమ మిక లేదులే !
మిథిలాపురికే పోదులే !
కథ లన్నీ ఎటో మారులే !
వ్యథ లన్నీ దిగజారులే !

(పాడుతూ వెళ్లిపోతారు)

## మూడో రంగము

(వర్షర్తువు, శివసింహ మహారాజు ఆస్థానంలో సభ. మహారాణి అనూరాధతో సభోపరిభాగంలో ఆసీనురాలై ఉంటుంది. విద్యాపతి, మహామంత్రి, సేనానాయకుడూ, అందరూ సభ నలకరించి ఉంటారు)

రావే ప్రావృట్కాలమ! నీరద
రథ నిస్వనములు మ్రోయగ తీయగ!
రావే, ఓ రాజేశ్వర విలులిత
వైద్యుత పతాక ఊగగ తూగగ!
ధవళ బలాకా తరళ వకుళ సుమ
హారీ ! స్వేచ్ఛాంబర సంచారీ!
లలిత మయూరీ నారీ లాస్య
పులకిత కేళీరంగ విహారీ !
రావే ప్రావృట్కాలమ!

రాజు : మంత్రీ, మా కా మంత్రాంగం ఇప్పుడు వద్దు.

మంత్రి : మహాప్రభూ! మిథిల– గ్రహించాలి – శత్రుమధ్యాన ఉన్నది. నా మనవి .....

రాజు : మాకు శత్రువులు లేరు. ఏ రాజు వచ్చినా ఎవరితో యుద్ధం చేస్తాడు?

మంత్రి : ప్రభువు లలాగ సెలవీయ కూడదు. నా మనస్సులో ఆగ్రహం లేదు కదా అని ఆయుధ విసర్జనం చేసే అమాయికులు ఉంటారా?

రాజు : ఆఁ! ఉండేవారు.

మంత్రి : కృతయుగంలో, పురాణాల్లో. ప్రసవాలతోటీ పాటల తోటీ యుద్ధాలు చెయ్యలేము ఇప్పుడు.

రాజు : ఆయుగమే మళ్లీ రావాలి మనకు. ఆయుధం కంటె అనురాగానికి ఎక్కువ శక్తి ఉన్నది కదూ, మహాకవీ!

విద్యాపతి : ఆఁ! ఉండి తీరింది!

మహామంత్రి : మహారాజా! తమ రొక మహాత్ములు, వారొక గురుదేవులు. రామరాజ్యం ప్రతిష్ఠిస్తా మంటారు. లోకం మాత్రం తమతో రాలేదు.

రాజు : మన ప్రజ లందరూ ఎంత అనురక్తులై ఉన్నారు మన మీద!

మంత్రి : ఏలినవారికి మనవి చెయ్య నక్కర లేదు: కాటకాదుల వల్లనే కాదు ప్రజలకు అసంతృప్తి, ఆగ్రహమూ కలగడము!

రాజు : మరి?

మంత్రి : కొన్ని కొత్త సందేశాలు మన దేశంలో ప్రచారానికి వచ్చాయి. ప్రజల కవి క్షేమకరంగా లేవు.

రాజు : (విసుగ్గా) మనస్సులో ఉన్నది స్పష్టంగా చెప్పండి!

మంత్రి : చిత్తం. రామరాజ్యం ఎంత నిదానంగా న్యాయంగా జరిగింది! కాని ఏ చదువు రాని చాకలి దుర్భాషో ఎంత ప్రళయం తీసుకొని వచ్చింది!

రాజు : మంత్రీ! చాలు. మహాకవీ! క్రొత్త గేయం కోసం తపిస్తున్నాము.

విద్యాపతి : ఆహా, వినండి!

ఆషాఢ యోషా మణీ కేశపాశాన
అల్లుకొన్నది తటిద్వల్లియో
మొగిలి గుబురుల నీలి మునుగు లోపల
వెలుగు రగిలించునది మొగలి రేకో
కడిమిపూ మొలనూలు దుడుకు గాలికి తూలు
అభిసారికకు త్రోవ కకుభ సుమముల కోవ !
పదము పదమున విరులై పాదుపుగా పదిలముగ
వర్షారమా ప్రణయ హర్ష మెటు దాచెనో

రాజు : ఆహా! ఆహా! అమృతమా, కవనమా ఇది!

రాణి : అనూరాధా! ఈ మణిహారం మహాకవి కంఠాన వేసి రా!

అనూరాధ : ఓ తప్పకుండా! నా కొక పాట వస్తూంది (పాడుతూ వస్తుంది).

ఆషాఢం అభిసారిక;
ఆత్మేశ్వరు డెవరో!
లోకులు వానని అంటే
చీకులు నీ రని అంటే
అమృతము ప్రణయమ్మనుచు, మ
హా కవు లంటారు.

మంత్రి : ఆఁ. ఆగు. వెయ్యకూడదా మణిహారం, అమ్మాయీ! ఇది రాజాస్థానం అన్నమాట మరిచిపోకు! అలాగ పాడకూడదు కూడా!

రాజు : అనూరాధా! ఆ మణిహారం ఇలాగ తే! మహారాణి

గౌరవ సూచకంగా పంపినది. మేమే విద్యాపతి మహాకవుల కంఠసీమ నలంకరిస్తాము. నేటికీ సభ ముగిసింది.

## నాలుగో రంగము

(శరద్రాత్రి మహారాణి లక్ష్మీదేవి అంతఃపురము – దూరాన్నుంచి గీతం ఒకటి వినబడుతుంది)

*తెలిరెల్లు బయలులో కొలకులో*
*తెలికొలకు టలలలో అంచలో*
*తెలి యంచ గరులలో వెన్నెలో*
*తెలివెన్నెలలోన చలువలో!*

*పొగడ తెరువుల కెలన వెదురులే*
*వెదురు గుబురులలోన గాలులే*
*గాలి యూరువులలో వెన్నెలే*
*తేలు వెన్నెలలలో వలపులే!*

రాణి : చపలా!

చపల : అమ్మా!

రాణి : ఓ చపలా !

చపల : ఓ మహారాణీ !

రాణి : "తేట వెన్నెలలలో వలపులే!" ఆ గీతం మహాకవి మందిరం నుంచా వినపడుతూంది!

చపల : ఔను ఇంక ఎక్కడ నుంచి?

రాణి : (ఉస్సురని దీర్ఘంగా నిట్టూరుస్తుంది)

చపల : అమ్మా! అలాగ నిట్టూరుస్తా రెందుకు?

రాణి : వకుళ పరిమళమ్ముననుు, వేణు వికచగీతి
కార్తిక జ్యోత్స్న నిండిపోగా నెడంద,
ఆ విధుర రాత్రి ఏమి చేయంగ నేర్చు?
ఊరకే చలియించి నిట్టూర్చు గాని!

చపల : అమ్మా! ఈ పద్యం ఎవరు వ్రాశారు? మా పీతాంబరే?

రాణి : (నిట్టూరుస్తుంది) చపలా! శరద్రాత్రి నిట్టూర్చడం ఎరుగుదురా? చంద్రుడు వచ్చాకా నిట్టూరుస్తుందా? ఊఁ హుఁ చపలా! ఈ దీపం ఎందుకు ఇవాళ?

విసరి వేయుము నేడు తారా విసర మాశాంతముల కొసలకు!
మసలకే వేంచేయునే నా మనోహర సంపూర్ణ చంద్రుడు!
చిరవియోగిని ఈ నిశీథిని ఇరుల చివురుల బ్రతుకు నేడు
మెరసి పోవునె నిలువునిలువున! విరిసిపోవునె జల్లు జల్లున!
చంద్రకాంత శిలాతికర్కశ సాలభంజిక, దాసి నేడు
కరగిపోవునె నిలువు నిలువున పారలి పారునె జల్లు జల్లున!

చపల : అమ్మా! ఈ పాట ఎవరిది? మా పీతాంబరే?

రాణి : హు ష్ ష్ ష్ . . .

నిను తలపులోన నిలుపగా నేని వలను
గాని పగలెల్ల ఒక్క యుగమ్ము నాకు!
తొలి నిదుర తోడ తొలి కల జాడ వెడలి
పరువు లిడీవత్తు నీ పరిష్వంగమునకు

చపల : అమ్మా! నా కోసం చెప్పినట్లుంది ఈ పద్యం. ఒక్క నిముషమయినా ఇంటి వద్ద పీతాంబర్ ఆలోచనే ఉండడానికి భయం. నిద్ర రాగానే కల; ఆ కలలో తత్క్షణం పరుగు పరుగునా అతని దగ్గరికి పోతా

రాణి : చపలా! అల్లాగ అనకు. ఈ గీతం అర్థం నీకు

తెలియదు. ప్రేమతో రాధ పాడే గీతం సుమీ నే పాడింది.

చపల : ఔను. అంటే?

రాణి : శ్రీకృష్ణు డంటే భక్తితో...

చపల : ఏమో నమ్మా! (అడుగుల చప్పుడు)

రాణి : ఎవరు వస్తున్నారు? అబ్బా!

చపల : అనూరాధ!

(అనూరాధ పాడుతూ వస్తుంది)

అనూరాధ : వాని పాట కన్న మున్న
వాని మాట కన్న మున్న
తేనె తేట జడియో, స
వ్వడియో లో మునురు కొన్న
నీ వేమౌదువో కాని
జీవ మలసి పోవు నేని

మహారాణీ! ఎందుకు అలాగ తూలిపడ్డావు! కలతగా ఉన్నావు. ఎవరు వచ్చా రనుకున్నావు? (మళ్లీ అడుగుల చప్పుడు) ఆఁ ఎవరిదా అడుగుల చప్పుడు? మహారాజా, మహాకవా? ఊఁ హుఁ ఎవరూ లేరు. మహాకవిని తీసుకొని రానా?

రాణి : వద్దు వద్దు! అబ్బా! అనూరాధా! నాకేం తెలియదు. వద్దువద్దు, తీసుకుని రావద్దు. తప్పు; అనూరాధా! తప్పా? తీసుకురా? ఉండలేను. ఇప్పుడే! ఇప్పుడే ఊఁ ( హుఁ వద్దు అనూరాధా!

రాజు : హబ్బా! (బాధతో అన్నట్లు)

రాణి : (ఆత్రుతతో) ఎవరది? మహారాజా! ఎప్పుడు వచ్చారు?

రాజు : (తెచ్చిపెట్టుకొన్న నిదానంతో) లక్ష్మీ! ఎందుకు అలాగ ఉన్నావు, పాపం! ఎంత నలిగిపోతున్నావు? మహాకవి వచ్చి పాడడం లేదా?

రాణి : ఎందుకు? వస్తున్నారు. రానక్కర్లేదు. వద్దు.

రాజు : అలాగంటా వెందుకు లక్ష్మీ! నీవు వెర్రి దానవు. విద్యాపతి మహాకవి, మహాభక్తులు! లోక కల్యాణం కోసం వారి కవిత్వమూ, జీవితమూను. వారి సన్నిధానంలో మనం ఎంత ఉంటే అంత మంచిది.

రాణి : (రాణి నిట్టూరుస్తుంది. దూరాన డోళ్లచప్పుడు–యుద్ధానికి హెచ్చరికలాగ)

చపల : మహామంత్రి!

రాజు : ఏమిటిది?

మంత్రి : మన్నించాలి. ఉత్కళ ప్రభువు దాడికి వస్తున్నాడు.

రాజు : మీరు వెళ్లండి. అనూరాధా! విద్యాపతులను తీసుకొనిరా. అరుగో వేంచేస్తున్నారు. మహాకవీ! నేను యుద్ధభూమి నుండి వచ్చిన దాకా తమరీ నగరంలోనే ఉండాలని మనవి. లక్ష్మి ఏకాకినిగా ఉండలేదు. సెలవు!

(రాణి నిట్టూరుస్తూ 'మహారాజా!' అంటుంది)

విద్యాపతి : మహారాణీ! ఎందు కా కలత?

రాణి : ప్రేమ తప్పా?

విద్యాపతి : ఏ ప్రేమ?

రాణి : నాది.

విద్యాపతి : అది నీవే నిర్ణయించుకోవాలి.

రాణి : నా ప్రేమా పీతాంబర్ మీద చపల ప్రేమ లాంటిదేనా?

విద్యాపతి : కాకూడదు.

రాణి : తెలియడం లేదు.

విద్యాపతి : ప్రేమ గొప్పదైన కొద్దీ దాని వల్ల తనకూ ఇతరులకూ కలిగే బాధ తక్కువ కావాలి. (రాణి నిట్టూరుస్తుంది) ఆ స్థితికి వచ్చేసరికి వ్యక్తులు నశిస్తారు. కేవలమూ ఈ శరత్ పూర్ణిమలాగ ఉంటుంది హృదయం. ఈ వెన్నెల అందరి మీదా వర్షిస్తుంది కాదూ? (రాణి ఏడుస్తుంది) మహారాణీ ! లక్ష్మీ!

రాణి : వద్దు వద్దు (ఏడుస్తుంది).

విద్యాపతి : అధైర్యపడ వద్దు. నీ హృదయం ఉత్తమ పథాలలోనే పరుగెత్తుతుంది. నీ లక్ష్యం గొప్పది. ఇంకా తపస్సు చెయ్యి. చూడు ఆ పారిజాతం! అంత గొప్ప పూజా పుష్పం లేదు. మరిగిపోయే రక్త హృదయం; శాంత ధవళమైన ప్రేమమూర్తి! మహారాణీ!

*రక్త హృదయమ్ము హిమపాండుర ప్రశాంత*
*వపు రుపరి మూర్తి నీకును పారిజాత*
*సుమ తపస్వినికిని, వనాధ్వమున ఈ క్ష*
*మా దృఢ నిరీక్షణమ్మె సుమా తపస్సు!*

నేను వెడుతున్నాను.

రాణి : (ఏడుస్తూ) అనూరాధా!

అనూరాధ : *ఈ తపస్సు దుస్సాధ్యం*
*పువు నిండా మధువైన*
*తవిలి విడని తీయనైన*
*పారల కుండ తొణకకుండ*
*చెరలో నిమిడేనా?*

ఎదలో నెమ్మదిలో కా
ముదులే పెను నదులైన
కదలి కనుల కనల కుండ
ఒదిగే దాగేనా?

బ్రతుకంతా వలపైన
కదలు పిలుపు దుడుకైన,
ఊరు పూరుపున సాగయక
ఊరకె సురిగేనా?

## ఐదో రంగము

(హేమంతము –మహారాణి అంతఃపురము – మహారాణితో మంత్రి ప్రసంగిస్తాడు. దూరాన్నుంచి గీతం వినపడుతుంది)

ఇంటి మొగసాల వేంచేసినా
కంట గనలేరు, హిమ కంఠ రావము వినరు
చైత్ర మాసము, మల్లికా హాసము నశించె
చిత్ర చిత్రేంద్ర చాప విలాసము గతించె
శారద రమా శుభ్రసౌందర్యము కృశించె మొగసాల

మంత్రి : వినరు, నా కంఠంలో నుంచి వచ్చిన దేదీ తమకు రుచించదు. మహారాణి! ఏమి చెయ్యను!

రాణి : నా హృదయం ఎప్పుడూ తప్పు కోరదు. మహా కవి సన్నిధానంలో ఉండడం దోషం అని నాకు తోచదు.

మంత్రి : దోషం అని నా అభిప్రాయమూ కాదు.

రాణి : మరి?

మంత్రి : మహారాజు శ్రేయస్సూ, కనుక రాజ్యమూ, ప్రజా శ్రేయస్సూ వాటిని గూర్చి నా కలత.

రాణి : ఏమి చెయ్య మంటారు?

మంత్రి : మహారాజు కోసం ఏమైనా చేస్తారా?

రాణి : నా కంత కంటే కావలిసిందేది? చేసి తీరతాను.

మంత్రి : రాజు శ్రేయస్సు రాజ్యం మీద ఆధారపడి ఉంది. రాజ్యం ప్రజ మీద. ఇందరి శ్రేయస్సూ తమ మీద!

రాణి : ఏమి చెయ్యమంటారు? మహామంత్రీ! తొందరగా చెప్పండి.

మంత్రి : తమరు పద్దన్నా తమరు ఉన్నంత కాలం మహారాజు తమ ఆనందం కోసం ఏదయినా చేస్తాడు.

రాణి : (ఆత్రుతతో) అంటే?

మంత్రి : తమరే లేక పోతే.

రాణి : (ఆత్రుతతో) అంటే?

మంత్రి : మహారాజు కోసం ఏదయినా చేయగలరా?

రాణి : (తొందరగా) ఆ( ఆ( చెప్పండి మహామంత్రీ! చెప్పండి!

మంత్రి : తమ రింక జీవించి ఉండకూడదు. ఇది విషం ఏ బాధా ఉండదు. సెలవు. మహారాజు కోసం. (మంత్రి వెడతాడు).

రాణి : (నవ్వుతుంది) అనూరాధా! ఇక్కడ లేదు. అదుగో అనూరాధా! మధుసూదన్ దూరాన పాడుతున్నారు. (దూరాన్నుంచి పాట వినబడుతుంది)

చీక టింటిలోన చీకు సంకెళ్లలో
చినికి పోయా నయ్య దేవా!
చావో, బ్రతుకో, తెలియ జాలనీ మనుగడకు
చాల నలగితి నయ్య దేవా!

అనూరాధ : పోయె నా కోయిలల కారు, పోయెను నవ
మల్లికల వేళ, శ్రావణమ్మా శరత్తు;
మూల మూలల నీ చంద్ర శాల నేడు
హిమ పదాంకములే తలలెత్తి పిలుచు

## ఆరో రంగము

(శిశిరర్తువు – మహారాణి నగరులో దేవాలయం.సంధ్యా సమయం)

ప్రతి శిశిర కుసుమమ్మ
ప్రతి శిథిల పత్రమ్మ
వెత అనో, సురిగినా
కత అనో అనుకోకు!

అవలి దరి మ్రోసేను
అలరు టూమని పిలుపు!
ప్రసవమో, వర్ణమో
మసలు నని యనుకోకు!

మహారాణి : ఇదేనా మహామంత్రి ఇచ్చిన సిద్ధౌషధం. ఇది త్రాగితే చాలా దూరం వెళ్లవచ్చును గదూ! ఒక్క గడియ ఇక్కడ ఉంచుతాను. ఏదీ నా వీణ! పాపం, ఎంత దిగులుగా ఉన్నావో! ఇవాళ బాగా పాడతావా? వీణా, ఈ పాట మహారాజు వినకూడదు. మహాకవీ వినకూడదు.

నేడేరమ్మ నేడే రమ్మ
వాడిన ఈ సుమము కోయ;
నేల వాలిపోవునా, పెంధూళి కౌగిలే యానో
విసరు గాలి తొందరలో
వేసవి నిశ్వాసములో

మసలకోయి! ఈ నిముసము
కొసనె గాదె నా మనుగడ!

ఇంక నిముసమే అబ్బా! ఊరుకోదు, ఈ వీణ!
నీకూ తొందరగా ఉందా?

మునరు రేయి తొలి చీకటి
మసక మసకలే యలమునా
మసలకోయి నీ పూజా
మంగళ సమయమె పోవునా!

(ఆలయంలో గంట మ్రోగుతుంది)

ఆఁ; పూజా సమయం మించిపోలేదు. మన పాటా
అయిపోలేదు. ఏదీ?

మన్పణ శ్రీ గళమాలిక
మలసి నిలుచునో లేదో
మసలకోయి మధువు లేల?
మధుర పరిమళము లేల?

నేను పారిజాతాన్నా, మందారాన్నా? చెప్పుకో వీణా!
వట్టి తృణాన్నేమో?

కొనగోరుల తురుమవేమొ
కూర్పువా బాధా భాగ్యము!
మసలకోయి మసలకోయి
మన్నింపవా జాలి మనవి!

(వీణ తీగె తెగుతుంది) ఆఁ ఇంక పాట చాలు, సెలవు.
ఏదీ మహామంత్రీ ప్రసాదం! (త్రాగినట్లు చప్పుడు)
హా! (అడుగుల చప్పుడు నీరసంగా ఆప్యాయంగా)
మహారాజా! మహాకవీ! వచ్చారా? ("మసలకోయి,
మసలకోయి మన్నింపవా జాలి మనవి"అనిఅంత కంతకూ

నీరసంగా అంటుంది  విద్యాపతి, రాజా, మంత్రి, అనూరాధ, దాదా వస్తారు)

రాజు : (రోదన స్వరంతో) లక్ష్మి !

విద్యాపతి : మహారాజా! లక్ష్మి వెళ్లిపోయింది. ప్రేమ ఉన్నచోటే లక్ష్మి ఉంటుందని చెప్పాను కదూ! నీ మంత్రికి తెలియదు పాపం! లోకధర్మం మీద, అర్థం మీద, ధీబలం మీద, భుజ శక్తి మీద లక్ష్మిని ప్రతిష్ఠిస్తానంటాడు వెర్రి వాడు. గుడ్లగూబ. మహామంత్రీ! గ్రహించావా? నువ్వు రాణిని చంపావా? రాగాన్ని చంపావా? హింస లేని ప్రేమతో చంపితేనే కాని నీ రాజ్యాన్ని నిలబెట్ట లేవు సుమా! సరే, అనూరాధా! ఎందుకా దుఃఖం? దాదా! నువ్వు లోపలికి చూసుకో! అనూరాధా, నువ్వు అలాగ చూడు. ఆ సముద్రం, ఆకాశం కలిసే చోట! అదుగో వసంతం అప్పుడే వచ్చేస్తూంది. రాణి కోసమూ, మన కోసమూ!

అనూరాధా, దాదా : ఆఁ హో.

విద్యాపతి : అనూరాధా! మధుసూదన్! ఇక రాజాస్థానం మనకు వద్దు. ఆశ్రమానికి పోదాం.

(ముగ్గురూ పాడుతూ దూరంగా పోతారు)

*మన సంతా వృథా భయమురా!*
*మని కంతా మధుమయమురా!*
*వన మంతా నందనమురా!*
*కను మంతా మోహనమురా!*

*మిథిలా పురమిక వదలరా!*
*శిథిలాశ్రమముకె కదలరా!*

# చైతన్య లీల

కథకుడు శ్లో.: *కృష్ణానుస్మరణా దేవ పాప సంజాత పంజరః॥*
*శతధా భేద మాయాతి గిరి ర్వ్రజహతో యథా॥*

అంటే వజ్రాయుధము చేత పర్వతము నూరు ముక్కలయిపోయినట్లు. పాప పంజరం నిత్య శ్రీకృష్ణనామ సంస్మరణము వల్ల బద్దలై పోతుందయ్యా అని లీలాశుకాచార్యులవారు సెలవిచ్చారు. అయితే శ్రీ కృష్ణభక్తిలో మధురభావం పారం అందుకున్నవారు శ్రీ చైతన్య మహాప్రభువులు.

ఒక భక్తుడు : అయ్యా! వీరి జన్మస్థానమేది? ఎప్పటివారు?

కథకుడు : దాదాపు అయిదు వందల ఏండ్లకు పూర్వం వంగ దేశంలో నవద్వీపంలో చైతన్యు లవతరించారు. వీరి తండ్రి జగన్నాథమిశ్రులు. తల్లి శచీదేవి. పితామహులు నీలాంబర చక్రవర్తి అనే ఉద్దండ పండితులు. ఈ దంపతులకు ముందు ఎనమండుగురు కూతుళ్ళు

పుట్టి పోవడమున్నూ, తొమ్మిదవ సంతానం విశ్వరూపుడనే కుమారుడు 16వ ఏట సన్యసించి పోవడమున్నూ, తల్లిదండ్రులకు 10వ బిడ్డ అయిన విశ్వంభరుడు ప్రాణానికి ప్రాణం అయాడు.

భక్తురాలు : అవును మరి! దేవకీ దేవికి శ్రీకృష్ణులవారు కూడా ఎందరో బిడ్డలు దక్కకుండా పోగా నిలిచిన వారాయెను!

కథకుడు : అల్లాగే చైతన్యులు కూడా శ్రీకృష్ణుల అవతారమే!

మరో భక్తుడు : అయితే విశ్వంభరుడే చైతన్య ప్రభువా?

కథకుడు : అవును. ఆయన రూపం అతిలోక సుందరమూ, గౌరవర్ణ రంజితమూ కనక గౌరాంగు డన్నారు. పూవు పుట్టినపుడే పరిమళిస్తుందన్నట్లు, పసిపాప తనంలోనే హరి అన్న రెండక్షరాలు వినగానే యేడుపు మానేవాడు కనక .......

మరోభక్తురాలు: ప్రహ్లాదుడు లాగ!

కథకుడు : గౌర హరి అనే వారు.

మరో భక్తుడు : మరి నీమాయ్, నిమా ఏమిటండీ?

కథకుడు : ఎందరో బిడ్డలు పోగా దక్కినవాళ్ళకి ఏదో పనికి మాలిన పేరు పెడతారు. 'నిమా' అన్నా, 'నీమాయ్' అన్నా వేపలాగ చేదు అన్నమాట.

భక్తురాలు : ఓహో! మనవాళ్ళు ఫకీరు, అబద్ధం అన్నట్టా?

కథకుడు : గౌరాంగుని జన్మస్థానం నవద్వీపం. నవద్వీపం అంటే మహాపండితుల కాటపట్టు. ముఖ్యంగా న్యాయ తర్క శాస్త్రజ్ఞులలో సార్వభౌము లక్కడుండేవారు. అట్టి విద్వాంసులలో అగ్రేసరులైన వాసుదేవ సార్వభౌముల చరణ సన్నిధిని మన గౌరాంగుడు

న్యాయశాస్త్రం (తర్కం) అంతా కరతలామలకం చేసుకున్నాడు. ఈయన సతీర్థుడు రఘునాథుడని పండిత శిరోభూషణం. 'దీధితి' అని తర్క శాస్త్రం రచించాడు. నాటికీ నేటికీ ఆ శాస్త్రంలో ఈ గ్రంథం ఆఖరి మాట! అయితే తానీ గ్రంథంతో విద్వల్లోకంలో ప్రథమ స్థానం సంపాదిద్దామనుకున్న రఘునాథునికి ఒక మనఃశల్యం దాపురించింది. కుమార గౌరాంగుడు తన పదునారవ యేటనే ఇంతకన్న ఉద్గ్రంథం రచించాడు. రఘునాథుడీ వార్త విన్నాడు. ఒకనాడు గంగానది మీద పడవలో గౌరాంగునితో విహారంచేస్తూ ఈ గ్రంథం విన్నాడు.

**ఒక భక్తుడు** : విన్నాక?

**కథకుడు** : వస్తా. ఒక్కసారి మనసారా చైతన్య ప్రభువుల నామసంకీర్తనం చేద్దాం. తర్వాత వారి లీలలు కొన్ని విన్పిస్తాను.

శ్రీకృష్ణచైతన్య ప్రభు నామ గానం
మధురం మధురం మధురాతి మధురం
ప్రియనామ గానం ప్రేమాలవాలం
ఆనందధామం, అమృతోపమానం
భవతాప హరణం భయపాపహరణం
నిర్ఘాత మరణం, నిభృతాపవర్గం

## మొదటి లీల

**చైతన్యుడు** : అన్నా! రఘునాథా! తమ ఆశీర్బలం వల్లను, శ్రీకృష్ణానుగ్రహం వల్లనూ, నేను రచింపగలిగిన గ్రంథం విన్నారు కదూ. తమ అభిప్రాయం .....

రఘు : (ఏడుస్తాడు)

చైతన్యుడు : అన్నా! అన్నా! ఎందుకయ్యా తమ రలాగ దుఃఖిస్తున్నారు చెప్పండి. దయచేసి చెప్పరూ?

రఘు : ఏం చెప్పను గౌరాంగా! లజ్జాభారం వల్ల కుంగిపోతున్నాను. నీవు విద్వచ్ఛిరోభూషణుడవు.

చైతన్యుడు : తమరే అలాగ సెలవిస్తే ఎలాగ?

రఘు : నాయనా! కొన్ని సంవత్సరాలు గురుదేవ చరణసేవ చేసి, నా గ్రంథం రచించాను. అది అశేష విద్వల్లోకంలో నాకు కిరీటం పెట్టి శాశ్వతంగా ఏకైక ప్రమాణ మవుతుం దనుకున్నాను. ఆ ఆశ నేడు అడియాస అయిపోయింది. నా గ్రంథం ఎంత సంగ్రహమో అంత సుస్పష్టం. నీ విద్వత్తు ఎంత అపారమో, నీ ఉపజ్ఞ అంత అసాధారణం. ఇంక నా 'దీధితి' కి పేరు ప్రతిష్ఠ లెక్క డుంటాయి?

చైతన్యుడు : (దుఃఖిస్తూ) ఇంతేనా? మీ దుఃఖాని కిదేనా కారణం? అన్నా! దుఃఖించకండి. మీ ప్రతిష్ఠకూ, మీ ఆనందానికీ నా గ్రంథ ప్రచురణ భంగం కలిగిస్తే, ఇదిగో ఈ క్షణంలో దీన్ని గంగానదిలో పారేస్తున్నాను.

(గ్రంథం నీటిలో విసిరిన చప్పుడు)

రఘు : (దుఃఖిస్తూ) ఆః ఆః గౌరాంగా! ఎంత సుకుమారమూ, ఆర్ద్రమూ అయ్యా నీ మనస్సు! ఇట్టి త్యాగం అది ఈ లోకంలో ఎన్నడైనా విన్నామా?

కథకుడు : శ్రీకృష్ణ చైతన్య ప్రభు సదయ హృదయం.

భాగవతులు : మృదులం, మృదులం, మృదులాతి మృదులం
నవపుష్ప మృదులం, నవనీత సదృశం.

కథకుడు : విన్నారా? నాయనా! ఈ విధంగా గౌరాంగ ప్రభువు

పండితుల్లో పండితుడై షోడశ వర్షప్రాయంలోనే షట్శాస్త్ర పారంగతుడై, గురుకులాధిపతియై శిష్య ప్రశిష్యులతో తైత్రయాత్ర చేసినవాడాయెను. ఇంతలో తల్లిదండ్రులు విష్ణుప్రియ అనే కన్యను చూసి వివాహం చేశారు. విష్ణుప్రియంటే ఎవ రనుకున్నారు? సాక్షాత్ లక్ష్మీదేవి అపరావతారం!

## రెండవ లీల

విష్ణుప్రియ : ఈ నాడు మీ జన్మదినం కదూ! మాఘపూర్ణిమ. ఎంత మనోహరంగా ఉందో ఈ రాత్రి! మీ సన్నిధిలో నా మనస్సులాగ చల్లని వెన్నెలతో నిండిపోయింది.

చైతన్యుడు : నీ సన్నిధిలో నా మనస్సూ అంతే, విష్ణుప్రియా! రాధాకృష్ణులకు అన్యోన్యమూ అలాగే ఉండేదిట!

విష్ణు : అవునట. ఈ వెన్నెల చూచినప్పుడల్లా నాకు బృందావనం, యమునా తీరం, తమాలవనం, వకుళవాసనా, అన్నీ జ్ఞాపకం వస్తాయి. మీరే శ్రీకృష్ణునిలా కనుపడతారు.

చైతన్యుడు : ఏమో! అవన్నీ చూచినప్పుడు నేనే రాధ ననిపిస్తుంది.

విష్ణు : మరి నేనో?

చైతన్యుడు : నీవూ రాధవే. మనందరమూ రాధలమే. భువనమోహనమైన ఆయన మురళి విన్నప్పుడు ఇల్లూ వాకిలీ విడిచి రాధాదేవి పరిగెత్తి వచ్చింది. ఉద్ధవుడూ రాధే అయిపోయి పరిగెత్తి వచ్చాడు.

*మురళీ మృదుమురళీ*
*మురళీ మధుమురళీ!*
*కడిమి తరువుల నడిమి తెరువుల*

నడిచి వచ్చే దెవరు మురళీ!
దుడుకు వలపుల కడరి తన యిలు
విడిచి వచ్చే దెవరు మురళీ!
సందెలను కాళింది యందెల
సందడించే దెవరు మురళీ!
మంద మందపు టూరుపుల ఎద
అందగించే దెవరు మురళీ!
ఆల పాదువుల పాల కడవల
అమృత ముంచే దెవరు మురళీ!
నీలి నీలి పిసాళి కన్నుల
నీరు నించే దెవరు మురళీ! మురళీ!

కథకుడు : శ్రీకృష్ణ చైతన్య ప్రభు ప్రేమ హృదయం
మకరంద మధురం, మాకంద మధురం

కొన్నాళ్ల తర్వాత గౌరాంగుని తండ్రి జగన్నాథ మిశ్రులు దివంగతు లవుతారు. పితౄణం తీర్చుకుందుకు గౌరాంగులు శిష్య బృందంతో గయాక్షేత్రానికి వెడతారు. అక్కడ గదాధరా లయంలో శ్రీకృష్ణుని పాద చిహ్నములు చూసి పరవశు డౌతాడు.

## మూడవ లీల

చైతన్యుడు : ఆహా, ఏమి భాగ్యం నాది! ఈ పాద చిహ్నాలు నా స్వామివేనా? వీనిపై నా శిరస్సు ఒక్కసారి మోపుతాను. నా ప్రభువువే ఈ పాద చిహ్నాలు. తప్పదు. కాకపోతే, వీటికి ఈ వకుళ వాసన లెందుకు? అరరే. స్వామి చిరుగజ్జెల మోతలు కూడ వినపడుతున్నాయే. తప్పదు, స్వామి అడుగు చిన్నెలే. ఓహో!

తానే నాకయి స్వామి వచ్చెనట బృందన్ వీడి, గో గోప బృం
దానన్ విందులు కూడ వీడి, ప్రియ రాధా సుందరీ రాగ గా
థా నవ్యోత్సవ మేని వీడి, అటు కాదా యేల నాలోన ని
ట్లౌనా, నా హృదయాన శారద శశాంకాంశుప్రభల్ పర్వునో!

ఈ దారి నా స్వామి నడచేనా?
పాదాల జాడ లివి విడిచేనా?
ఎవరైన నా విభుని చూచేరా? స్వామి
ఏమైన నా మాట అన్నారా?
ఎన్నాళ్ల కెన్నాళ్ల కన్నారా! మీరు
కన్నార నా స్వామి కన్నారా!
కరిమేను చిన్నెల్లో విరిసేనా! స్వామి
చిరు నవ్వు వెన్నెల్లు కురిసేనా?
శిఖపైని శిఖిపించ మూగేనా? స్వామి
ఒకసారి నవవేణు వూదేనా?
మనసంత కోరికలు మూగేనా, మీ
మనికంత ఊయాల లూగేనా?
బృందావనీ సీమ ఇదియేనా? కా
ళిందీ నదీ తీర మిదియేనా?
రాధా మనోవీథి విడిచేనా? స్వామి
ఈ దారి నా కొరకు నడిచేనా?
ఏవైన నామాట లడిగేనా?

అయ్యా! బృందావనానికి దారేది? నన్ను తీసుకుని వెడతారా?

నిత్యానందుడు: అయ్యా, బృందావనం ఎందుకు?

చైతన్యుడు : అయ్యా! నాస్వామి శ్రీకృష్ణుడు తానే స్వయంగా అక్కడికి వేంచేశాడు. నేనక్కడికి వెళ్లద్దా?

నిత్యానందుడు: అయ్యా! నీవెవరవో మహాభక్తునిలా కనబడు తున్నావు. శ్రీకృష్ణ దర్శనం కోసం బృందావనం

వెళ్లాలా? నేను క్రుంకని తీర్థం లేదు. నేను చూడని క్షేత్రం లేదు. నా కడు గడుగునా యమునా, బృందావనం సాక్షాత్కారిస్తూనే ఉన్నాయి.

చైతన్యుడు : అన్నా! నీవెంత ధన్యుడవు! అక్కడే స్వామి కూడా సాక్షాత్కారిస్తాడాయెను. అన్నా! నాకూ చూపించవూ? కలిసి చూద్దామా?

నిత్యానందుడు: ఆఁ మనం ఎప్పుడూ కలిసుందాం. ఇ దేదో ఈ నాటి బంధంలా కనపడదు. నీ పేరు?

చైతన్యుడు : నిమాయ్. అన్నా! నిన్ను చూస్తే ఎన్నడో మమ్మల్ని విడిచి వెళ్లిపోయిన మా అన్న విశ్వరూపుడు జ్ఞాపకం వస్తున్నాడు. నువ్వే మా అన్నవా?

నిత్యా : అవును. అల్లాగే అనుకో. నా పేరు నిత్యానందుడు.

చైతన్యుడు : నిన్ను 'నితాయ్' అని పిలవనా?

నిత్యానందుడు: అలాగే పిలు!

చైతన్యుడు : నితాయ్!

నిత్యానందుడు: నిమాయ్! రా మనింటికి పోదాం!

(చైతన్యుడు, నిత్యానందుడు కలిసి)

*బృందావనానికే పోదామా? కా*
*ళిందీ నదీ తటికె పోదామా? శ్యా*
*మసుందరుని చూదామా? రా*
*ధా మనోహరుని చూదామా?*
*స్వామి సన్నిధిని నిలవాలీ! శ్రీ*
*చరణ పంకజము కొలవాలీ!*
*నామ కీర్తనము చేయాలీ! శ్రీ*
*ధామమునకు వేంచేయాలీ!*

చైతన్యుడు : అమ్మా! తలుపు! తలుపు!
శచి : నిమాయ్ వచ్చావా, నాయనా!

చైతన్యుడు : వచ్చానమ్మా. అన్న కూడా వచ్చాడు!

శచి : ఎవరు నాయనా? ఎవరా అన్న?

చైతన్యుడు : మ నన్నే! నీ విన్నాళ్లూ ఎవరికోసం తపిస్తున్నావో ఆ అన్నే!

శచి : విశ్వరూపుడా?

చైతన్యుడు : ఎందుకాడు? నే నితన్ని నితాయ్ అని పిలుస్తానమ్మా. నువ్వూ అలాగే పిలు.

నిత్యానందుడు: అమ్మా! నన్నే నీ విశ్వరూపు డనుకో. నేనే నీ పెద్ద కొడుకుని.

శచి : (దుఃఖిస్తూ) నాయనా! వచ్చావా? నన్నింక విడిచి వెళ్లకు. నీ తమ్ముణ్ణి వదలకు. వాడు బొత్తిగా అమాయకుడు. ఏమీ తెలియదు. వాణ్ణి వెయ్యి కళ్లతో కనిపెట్టి చూస్తూండు. నా కళ్ల ఎదుట ఎప్పుడూ రామకృష్ణుల్లాగ ఉంటూ ఉండాలి.

నితాయ్ : అవునమ్మా! నీవు యశోదా దేవివి . మా తల్లివి.

శచి : నితాయ్! నిమాయ్!

నిత్యా, చైత : అమ్మా!

కథకుడు : శ్రీకృష్ణ చైతన్య ప్రభు ముగ్ధ హృదయం
ముదితం ముదితం ఆనంద ముదితం

వింటున్నారా! చైతన్య ప్రభువుల గాథ? తానూ, నిత్యానందుడూ, కలిసి అహర్నిశలు శ్రీకృష్ణ నామగానం చేస్తూ, నవ ద్వీపంలోనూ, పల్లీ పట్టణా ల్లోనూ శ్రీకృష్ణగాథామృతం వినిపిస్తూంటే

సామంతులూ, సామాన్యులూ, పండితులూ, పామరులూ, ఆ బాలగోపాలమూ హరి ప్రేమసాగరంలో మునిగిపోయారు. చైతన్యుని నోట 'హరి' అనే మాట వస్తే అందరూ వివశులై 'హరీ!' అని కీర్తన చేసేవారు. చైతన్యుని మూర్తి ఎదుట కనిపించగానే అందరూ ముగ్ధులై ఉన్మత్తులై వెంటబడేవారు. గౌరాంగుని ప్రభావం చూసి శుష్క కర్మిష్ఠులు ఆగ్రహించి మత భ్రష్టునీ, సంఘ ద్రోహనీ నిందించేవారు. అప్పుడు గౌరాంగుడు సంఘ మతాల అవధులు దాటిన సన్యాసాశ్రమం స్వీకరించి తన్ను ద్వేషించిన వారిని కూడా తన విశాల ఆలింగనం లోనికి స్వీకరించి లోక సంగ్రహార్థం శ్రీకృష్ణ చైతన్యు లయారు.

శచి : నాయనా నితాయ్ నీవుండి కూడా నీ తమ్ముణ్ణి సన్యాసిని చేశావా? ఇల్లూ, వాకిలీ, ఆలుబిడ్డలూ - పువ్వుల తోటలా ఉండవలసిన సంసారం. ఇలా శ్మశానం చెయ్యడమేః! ఇంక నేనీ శూన్యంలో ఎలా ఉండగలను. చెప్పు నితాయ్!

నితాయ్ : అమ్మా! నీ కుమారుడు కనుకే నిమాయ్ సన్యసించాడు. నీవు యశోదా దేవివి కావూ? ఆ తల్లి ఏం చేసింది? తన బిడ్డను లోక కళ్యాణం కోసం అర్పించి తాను అందరికీ తల్లి అయింది. అందరి లోనూ తన బిడ్డను చూసుకుంది. అమ్మా! చూస్తున్నావు కదూ. నేటి లోకంలో కుమతం, ద్వేషం, శుష్క తర్కం, శూన్యవాదం ప్రబలి ఉన్నాయి. నీ కుమారునిది నిరాశ, విరక్తి వల్ల స్వీకరించిన సన్యాసం కాదు. నిర్భర కరుణార్ద్రమూ, విశాల ప్రేమ రంజితమూ అయిన దివ్య విధానము. ఆయన కారణ జన్ముడు. మన మిద్దరమూ కూడా ధన్యులము.

శచి : నితాయ్!

నితాయ్ : అమ్మా! .... (దూరాన్నుంచి)

కంఠస్వరం : కృష్ణా, శ్రీ హరీ, శ్యామసుందరా! వస్తున్నా. ఓ నవ ద్వీప వాసులారా! నరనారులారా! రండి అందరూ రండి. నామ సంకీర్తనం చెయ్యండి. నిత్యానందా! నీవు వచ్చావా? స్వామి వేంచేస్తున్నారు. అదుగో ...

## నాలుగవ లీల

*ఏ నెరుంగుదును నిత్యానంద! తప్పదు!*
*అవి దేవదేవుని అడుగు నడులె;*
*ఊరకే నిలువెల్ల కోరగించునె చూడు*
*మేను మేను కడిమి మ్రానువోలె!*
*ఇటునటు తూగాడు నేయెడ శ్యామసుం*
*దరు మెడ పొగడ పూసరము కరణి!*
*ఏలాగు రాగమ్ము లెగయునో యమున హృ*
*దయమున తరగ దొంతరుల వగిది!*
*దెసదెసల విరజాజి పందిరులు కప్పె*
*స్వాంతమందు శరద్విభావరులు నిండె*
*అదె అదే స్వామి వేంచేసె నదె, అతండె*
*అస్మదానంద జలధి నీహార రోచి*

నిత్యానందుడు : చైతన్య ప్రభూ! నీ వెంత ధన్యుడవో కాని, నాకు మాత్రం స్వామి సాక్షాత్కరించడం లేదు.

*అయ్యయో! నీలమోహన మూర్తి కాదది,*
*సాంద్ర కదంబక చ్ఛాయ గాని*
*అదిగొ చలచ్చంద్ర కావతంసము కాదు*
*చపలకీసాల మంజరియె సుమ్ము*
*వినరాదొ మరల పిల్లన గ్రోవి కాదు, వె*
*దుళ్ల పయ్యెర పరవళ్ల రవళి*

అది చిరునవ్వు కాదమ్మ కొమ్మల నందు

అందలి వెన్నెల యలరు కనుము
ఏటి బృందావనీ వాటి ఏటి తరణి
నందనానంద రాగ నిష్యంద గీతి
ఏటి వ్రజపల్లి అవ్వి ఏ నాటి కథలు?
ఈ వృథా వ్యథ లేటికోయీ మహాత్మ!

చైతన్యుడు : తప్పు - తప్పు! నితాయ్! అలా అనకూడదు. స్వామి తీరా వేంచేశారు. రా, నామ కీర్తనం చేద్దాం!

హరి హరి హరి
హరి బోల్ హరి
గిరిధారీ, శౌరీ, హరి
నరనారీ హారీ, హరి!

సుందర గో గోపీ జన బృందావన బృందావన
సంచారీ! వ్రజనారీ సరసరాగ పథ విహారీ!
శరచ్చంద్ర వదనా! మధురానురాగ సదనా! నవ
మదనా, మోహన, రాధాముదిత హృదయ రమణా!
నీలమణి నీపవనీ నీలోత్పల నీరధర
శ్యామల, సుమకోమల, మామక మానసలోలా!
మౌని హృదయ పాలా!

(భజన దూరం వెడుతుంది)

1వ గాయకుడు : ఏమి సంకీర్తనం! ఏమి తన్మయత్వం!

2వ గాయకుడు : భజన కూటం దూరంగా పోయినా తామిక్కడే నృత్యం చేస్తూ ప్రభువు ఉండిపోయారు.

3వ గొంతు : ప్రభూ, ప్రభూ! మన నిత్యానందుణ్ణి ఆ దుర్మార్గులు కొట్టారు. చంపేస్తున్నారు.

చైతన్యుడు : ఎవరు?

3వ గొంతు : వాళ్లా – జాగాయ్, మాథాయ్.

చైతన్యుడు : ఎవరు వాళ్లు?

1వ గొంతు : నవద్వీపం కొత్వాళ్లు!

2వ గొంతు : మహా దుష్టులు ప్రభూ! స్త్రీలను చెరపట్టారు.

3వ గొంతు : దారి దోపిళ్లు చేశారు.

1వ గొంతు : హత్యలు చేశారు. అమాయకుల ఇళ్లు అంటించారు.

చైతన్యుడు : పాపం, రండి పోదాం!

(హరి హరి అనే పాట దగ్గరగా వినపడాలి)

కొన్ని గొం : చైతన్య ప్రభువులు! చైతన్య ప్రభువులు!

చైతన్యుడు : నితాయ్, గట్టి గాయాలే తగిలాయే, పాపం!

నితాయ్ : ప్రభూ, నాకు భయం లేదు. వీరిద్దర్నీ రక్షించండి.

చైతన్యుడు : నాయనా, జాగాయ్, రా! మాధాయ్, ఇలా రా, నన్నొకసారి కౌగిలించుకోనీండి.

1వ గొంతు : ఆహా! చూడు ప్రభువు పాదాల మీద ఎలా పడిపోయారో వాళ్లు! ఏమిటీ ప్రేమ ప్రభావం?

2వ గొంతు : ఇదే కాబోలు రాతిని మనిషిని చెయ్యడమూ, రాక్షసుల్ని దేవతల్ని చెయ్యడమూను!

కథకుడు : శ్రీకృష్ణచైతన్య ప్రభు దివ్య హృదయం

భాగవతులు : *మసృణం శిశిరం నీహారశిశిరం*

ఇలాగ చైతన్య ప్రభువు కర్కశ హృదయాలను కరుణార్ద్రం చేశాడు. పాషండుల్ని భక్తుల్ని చేశాడు. ఒకనాడు ప్రభువు దర్శనానికి ఉత్కళ దేశాధిపతి మంత్రి భట్టాచార్యులు వస్తాడు.

# ఐదవ లీల

భట్టాచార్యులు : ప్రభూ!

చైతన్యుడు : ఎవరు మీరు? ఎందుకొచ్చారు?

భట్టాచార్యులు : పంచగౌడాధినాయక, వీర కేదార, ప్రతాపవీరవర, రణ వాణీ జార, ప్రతాపరుద్ర గజపతి మహాదేవుల వారు తమ దర్శనం చెయ్యాలని కుతూహల పడుతున్నారు. తమరు ఒక్కసారి దయచేస్తే ...?

చైతన్యుడు : (కొంచెం గంభీరంగా నవ్వి) అటువంటి మహారాజు ఈ పేద సన్యాసి దర్శనం కోరుతారా?

భట్టాచార్యులు : కోరుతున్నారు స్వామీ, మా ప్రభువు ...

చైత : నే నెరుగున్న ప్రభు వొక్కడే, ఆయన సన్నిధి వదలి నేను రాలేను.

భట్టాచార్యులు : పోనీ, వారే మీ దర్శనానికి వస్తారు. తమరు అనుమతిస్తే...?

చైతన్యుడు : ఆ తరుణం ఇంకా రాలేదు. సార్వభౌముల ప్రభుతకూ, పేద సన్యాసులకూ బహుదూరం. శ్రీ వైకుంఠాది దివ్య క్షేత్రాల సందర్శనానికి వెడుతున్న నా కెందుకు ఈ ఆహ్వానాలూ, రాజ మర్యాదలూను?

భట్టాచార్యులు : ఉత్కళ గజపతుల రాజ్యం గౌతమీ కృష్ణా నదుల దాటి కాంచీపురం దాకా వ్యాపించి ఉంది. యాత్రా మార్గంలో తమకు కావలసిన సదుపాయాలన్నీ చేయించగలరు. గోదావరీ తీరాన వారి సామంతులు రామానంద రాయ లున్నారు.

చైతన్యుడు : నాకు శ్రీ కృష్ణదేవుల దర్శనం కూడా ఇప్పించగలరా వారు?

భట్టాచార్యులు : ప్రభువులు క్షమించాలి!

కథకుడు : శ్రీకృష్ణ చైతన్య ప్రభుభక్త హృదయం

భాగవతులు : ముదితం ముదితం ఆనంద ముదితం

కథకుడు : అప్పుడు చైతన్యులు శిష్య ప్రశిష్యులతో దక్షిణ క్షేత్రాలకు బయలు దేరారు. భక్తి వివశులై జనం వారితో స్త్రీ పురుష లెందరో వెంబడించారు.

## ఆరవ లీల

చైతన్యుడు : నమో నమస్తే! సాగర సహధర్మ చారిణీ గోదావరీ! నిత్యానందా! అటు భద్రాద్రి రామాలయం. రామానంద రాయలూ! గౌతమీ తీరాన ఇసుక తిన్నెలు యమునా పులినాలను జ్ఞప్తికి తెస్తున్నాయి.

రామానంద : చిత్తం!

చైతన్యుడు : ఆ నగర మేమిటి?

రామానంద : రాజమహేంద్రవరం.

చైతన్యుడు : ఇటు ఈవలి ఒడ్డున రాధాకృష్ణ మందిరం కట్టించు.

రామానంద : చిత్తం. తమ పాద చిహ్నాలు అద్దుకున్న పవిత్ర స్థలం.

(కొంచెం వాద్య సంగీతం)

చైతన్యుడు : నిత్యానందా! ఇది కృష్ణ వేణీ నది. ఈ ప్రాంతాననే లీలాశుకు లవతరించారు. ఏరీ? ఏమన్నారు వారు? 'అయి మురళి! ...'

నిత్యానందుడు : *అయి మురళీ! ముకుంద స్మేర వక్త్రారవింద*
*శ్వసన మధు రసజ్ఞే !త్వాం ప్రణ మ్యాద్య యాచే!*

అధర మథ సమీపం ప్రాప్తవత్యాం భవత్యాం
కథయ రహసి కర్ణే మద్దశాం నన్దసూనోః ॥

అందరూ : అదిగో, అదిగో! శ్రీక్షేత్రం.
హరి హరి హరి
హరి హరి యని
ఒకసారీ
ఒక్కసారి
మందర గిరిధారీయని
మరి మరి మరి అనరారే
అనరే అనరారే నరనారులార! నోరార!

చైతన్యుడు : శ్రీ వేంకటేశ! శేషాచలవాస!
మామక స్వాంత కాసార కలహంస!
త్వద్దయాపాంగ సుందర కటాక్షమ్ము
మాపైని ప్రసరింపవే – హరి హరి హరి ...
(కొంచెం వాద్య సంగీతం)
అదిగో కాంచీపురం. అదే శ్రీవరద రాజస్వామి
ఆలయ గోపురం.

అందరూ : హరి హరి హరి
హరి హరి యని
ఒక సారీ
ఒక్కసారి
కరుణా రస జలధీ యని
నవ లావణ్యా నిధీ యని
ఒకసారీ ఒక్కసారి ...

చైతన్యుడు : కరిరాజ వరద! ఓ వర దయా పాథోధీ
వరదరాజా! భక్త కైరవ వనీరాజ!
కుంద సుమ సిత మంద మందస్మి తాననము
ఒకసారి దయ జూపవే!

అందరూ : హరి హరి హరి ....

(కొంచెం వాద్య సంగీతం)

చైతన్యుడు : అహొ కావేరీ తీరాన భూలోక వైకుంఠం. రంగే శయానుల దివ్యధామ మదే!

అందరూ : హరి హరి హరి
హరి హరి యని
ఒక సారీ
ఒక్కసారి
భవ కల్మష హారీ యని
వైకుంఠ విహారీ యని ...

చైతన్యుడు : *రంగ రంగధామ రంగేశ్వరా! ఆశ్రి*
*తాంతరంగ వాంఛితార్థదాయి*
*రంగశాయి! భవభక్త రాజీ మనోజ్ఞ మ*
*రందపాయి – శ్రీ*
*రంగ రంగ శాయి*

అందరూ : హరి హరి హరి
హరి హరి యని
ఒకసారీ
ఒక్కసారి
మౌని హృదయ లోలా! యని
మధుమధుర లీలా! యని

(కొంచెం వాద్య సంగీతం)

చైతన్యుడు : నిత్యానందా! ఇది పుండరీక యోగీంద్రులు తరించిన సీమ. ఈ భీమ నదీ తటాన పాండురంగ విఠల్ స్వామి అవతరించారు.

*పాండురంగ రంగా!*

*భక్త చిత్తకమల భృంగా!*

*పరవశీకృ తాంతరంగా!*

అందరూ : హరి హరి హరి
హరి హరి యని
ఒకసారీ
ఒక్కసారి
నీలాచల వాసా! యని
నిత్య నవ విలాసా! యని ...

(కొంచెం వాద్య సంగీతం)

చైతన్యుడు : నిత్యానందా! సర్వ క్షేత్రాలూ ఈ జగన్నాధ క్షేత్రంలో వెలసి ఉన్నాయి. ఈ ప్రపన్న కోటితో కలిసి మనం శ్రీ జగన్నాథుని కీర్తిద్దాం.

నాథ హరే జగన్నాథ హరే ...

(అందరూ కలిసి అష్టపది పాడుతారు)

చైతన్యుడు : ఏమి టీ జనసమూహం, నితాయ్!

నిత్యానందుడు: శ్రీ జగన్నాథుల రథోత్సవం జరుగుతూంది.

చైతన్యుడు : రథాలమీద సుభద్రా బలభద్రులతో ప్రభువులు వేంచేసి ఉన్నారా?

నిత్యానందుడు: చిత్తం. కాని రథాలు మాత్రం కదలడం లే దెందుచేతో?

చైతన్యుడు : అవెలా కదులుతాయి? భువన భువనాలు కుక్షిలో నిముడ్చుకొన్న దేవదేవు లాసీనులై యున్న రథాలాయెను! ఈ మానవ బాహువులూ, లౌకిక పాశాలూ ఎలాగ లాగ గలవయ్యా? ముందు నామగాన కీర్తనం చేయాలి. ప్రేమ పాశాలు తగిలించాలి. భక్తి ప్రపత్తులు శక్తి నివ్వాలి. ప్రభువు మనస్సు కరగాలి. రథం కదలాలి. నడు! మనం కూడా రథాలు లాగి తరిద్దాం.

హరి హరి హరి
జగన్నాథ హరీ హరీ!
జగన్నాథ జగన్నాథ!
జయ జయ జయ
జగన్నాథ!

(కేకలు, కోలాహలం)

ప్రతాప : మహాప్రభూ! నేటికి తమ దర్శన భాగ్యం కలిగింది. జగన్నాథ దేవుల రథంతో పాటు నా జీవిత మంతా పునాదులతో కదిలింది. నాకు దేవ దేవుడు కూడా తోడై రథం కదలనీయలేదు. లేకుంటే తమ దర్శనం నాకు కలుగుతుందా? ఎన్నాళ్లకెన్నాళ్లకు ? చైతన్య ప్రభూ! అనుగ్రహించండి.

చైతన్యుడు : ఎవరయ్యా నీవు? పరమభక్తుని వలె కనబడు తున్నావు?

ప్రతాప : ప్రతాపుణ్ణి!

చైతన్యుడు : అనగా?

ప్రతాప : పంచ గౌడాధినాయక ...

చైతన్యుడు : ఓహో, ఉత్కళ ప్రభువువా?

ప్రతాప : కాను. కాను. అవేవీ కాను. ఒక్కడే ప్రభువు. ఆ ప్రభువు పాద రేణువును.

చైతన్యుడు : భేష్! నాయనా, ఇలారా! నిన్ను కౌగిలించుకోనీ! నాయనా, నిత్యానందా! శ్రీవాసా! ఇటురండి. స్వరూపా! రామానందా! ప్రతాపా! అందరూ రండి. నా మాటలు వినండి. శ్రీకృష్ణ నామగానం కన్న మనకు వేరే తరణోపాయం లేదు. శ్రీకృష్ణ నామ సంకీర్తనమే శ్రీ చరణాల సన్నిధికి అచంచల సోపానం. మన పెన్నిధానం సంకీర్తనం. ఆధివ్యాధి

హారిణి సంకీర్తనం. కోటి యజ్ఞ యాగాదులకన్న మిన్న సంకీర్తనం. మనస్సును శుభ్ర సుందరం చేస్తుంది. ప్రేమామృతంతో తడుపుతుంది. ఉత్తమజ్ఞానం పునాదిగా పెట్టి భక్తితో ప్రేమతో ఉదాత్త కర్మ మందిరం నిర్మించండి. ఏదీ, విన్నారా?

శ్లో॥ చేతో దర్పణమార్జవమ్ భవమహాదావాగ్ని నిర్వాపణమ్
శ్రేయో భైరవ చంద్రికా వితరణమ్ విద్యావధూ జీవనమ్।
ఆనందాంబుధి వర్ధనమ్ ప్రతిపదమ్ పూర్ణామృతాస్వాదనమ్
సర్వాత్మ స్నపనమ్ పరమ్ విజయతే శ్రీ కృష్ణ సంకీర్తనమ్।

చైతన్యుడు : అదిగో వింటున్నారా నా జీవితేశ్వరుని ఆహ్వానం! అందరూ నాతో రండి. ఆ సాగరం, యమునా, నీలాచలం, బృందావనం, సూర్యాతపం, కార్తీక అన్నీ కలిసిపోతున్నాయి. కలిసిపోక? భువన భువనాలను ముంచివేసే ప్రేమ ప్రళయం పొర్లుకొని వస్తూంటే ఈ సాగరంలో ఒక్కొక్క నీల తరంగం ఒక్కొక్క శ్యామ సుందర మూర్తి యై చేతులెత్తి పిలుస్తున్నాయే! ఇదుగో చూడండి – ఈ ఇసుక తిన్నెల మీద అడుగు జాడలు, శంఖ చక్రాంకితాలు. తిన్నగా సముద్ర తలానికి తోవ చూపిస్తున్నాయి.

నిత్యానందుడు: ప్రభూ! ఎక్కడి కెక్కడికి? అంత తొందరగా వేంచేస్తున్నారు!

చైతన్యుడు : ఎక్కడికి? బృందావనానికి, వైకుంఠ ధామానికి. అదిగో రాధాదేవి! ఎలాగు భరించావమ్మా? వస్తున్నా, నేనూ వస్తున్నా!

రాధ విరహబాధ అనురాగ మధుర గాథ
జాలి మాలి వన మాలి చనియె నొక్కనాడు
బేలమనసు రాధ నొకతె ఏలా విడిచి నాడు
దరియె లేని విరహ రాగ తప్తయైన రాధ

ఇరులు మూగు మునిమాపున ఇల్లు వెడలి బాధ
దౌల దౌల మురళి చల్లగాలి తేలి మ్రోగే
తాళలేక రాధ మనసు తల్లడిల్లి ఊగే
నిబిడ తరుణ నీప వనీ ఛాయ రాధ నిలిచే
కృష్ణ కృష్ణ కృష్ణా! యని కేరి కేరి పిలిచే

**కథకుడు, భాగవతులు :**

శ్రీకృష్ణ చైతన్య ప్రభు దివ్య చరితం
నిర్ధూత దురితం ఆనంద భరితం
మధురం మధురం మధురాతి మధురం

# ఊర్వశి

## మొదటి రంగము

పురూరవుడు : ఊర్వశీ !

ఊర్వశి : ఆఁ !

పురూరవుడు : ఊర్వశీ, ఈ మందాకినిలో కాళ్లీడుస్తూ కూర్చున్న నిన్ను దూరాన నుంచి చూసి పొదరింటిలో నుంచి జారిపడి, నీటిలోకి ఒరిగిన మాలతీలత వను కున్నాను.

ఊర్వశి : ఓహో! మీరా? స్వామి! ఇక్కడికెలాగ దయచేశారు?

పురూరవుడు : ఎలాగో తెలియదు. వెదకుతూ వెదకుతూ ఇలా వచ్చాను.

ఊర్వశి : ఎక్కడ వెదకుతూ?

పురూరవుడు : ఎక్కడైనా సరే ఎన్ని చోటుల్లోనో వెదకాను. పుట్టినప్పటి నుంచీ కూడా వెదకాను.

ఊర్వశి : దేని కోసం?

పురూరవుడు : దేనికోసమో కూడా నిన్నటి వరకూ తేల లేదు. తెలియదు కూడాను.

ఊర్వశి : పాపం! ఇలాంటి అన్వేషణ ఎంత బాధ కలిగిస్తుందో?

పురూరవుడు : నీ కెలాగు తెలుసును?

ఊర్వశి : ఎక్కడికీ కదలకుండానే వెదకుతూ ఉండ గూడదూ?

పురూరవుడు : అవును. నాకు తెలుసును. కాని స్వర్గంలోనే ఉన్న వాళ్లు దేనికోసం వెదకుతారు?

ఊర్వశి : ఇక్కడ లేని దాని కోసం. ప్రేమ కోసమూ, జీవం కోసమూ, సౌందర్యం కోసమూను. స్వర్గవాసం అంత ఆనందం ఇస్తుం దనుకున్నారా? ప్రేమ లేకుండా ఉండేదీ, యెడ తెగనిదీ, సంసారం కాని సంసారం సౌఖ్య మిస్తుందా? హృదయం అచల పాషాణమై పోయి, కదలనైనా కదల లేకపోతే, సుధర్మాస్థానంలో ఈ కళేబరాన్ని నిత్యమూ నృత్యము చేయించడం సౌఖ్య మిస్తుందా? ఎటు జూచినా, ఎప్పుడూ, అందరూ, ప్రతి పదార్థమూ ఒక లాగే ఎప్పుడూ కనబడుతూంటే సౌఖ్యంగా ఉంటుందా? ఎప్పుడూ వసంతమై తే, వసంతంలాగ ఉంటుం దనుకున్నారా? ఎప్పుడూ పగలే అయిపోతే లోపల ఎంత చీకటిగా ఉంటుందో మీకు తెలుసునా? మీ కేమి తెలుస్తుంది, ఈ స్వర్గ వాసము నరకవాసము కంటే దుస్సహ మని? స్వర్గం నిర్జీవ పాషాణం, శిలా నియమం, అచల విధానం. నరకమో? హాలాహలం కాగలదు, అగ్ని దాహం కాగలదు. అంతే–నాకు అదేనా కావాలి. స్వామీ! నిన్నటి వరకూ మీ అన్వేషణం దేని కోసమో తేలలేదన్నారు. ఇప్పుడు తేలిందా?

పురూరవుడు : ఊర్వశీ! భూలోకాని కంతకూ ఏకైక సమ్రాట్టు ఈ పురూరవుడు. ఎంత అమోఘమైన అధికార మున్నదో నాకు, అంత విశ్రాంతి లేని బాధ్యతా ఉన్నది. ఒక

కనురెప్ప పాటైనా ఏ అర్ధ రాత్రి వేళనైనా నాలో నేను ఒక్కణ్ణే ఉండి, తనివి తీరా నా వేదనలో కాలిపోవడానికైనా వీలు లేకపోయింది. లోపల లోపల రగులుతూ ఉండే నా వాంఛను అలాగే ఇముడ్చుకుంటూ వచ్చాను. కాని, ఊపిరాడ నీయని అంత రాజ్యకార్యపు తొందరలోనూ, సగం తెలిసో, తెలియకుండానో ప్రతి హృదయానికీ హృదయం తగిల్చి చూచి అది నాకు అక్కరలేదని గ్రహించుకునే వాణ్ణి. ప్రతి సౌందర్యరాశికీ ఎదురుగా నా జీవితాన్ని నిలిపి, అది నా కోసం కాదని పెడమొగమై పోయే వాణ్ణి. ఈ ఆవేదనా, అన్వేషణా నన్ను కవిని చేశాయి.

ఊర్వశి : అబ్బా! ఎంత నలిగిపోయారు!

పురూరవుడు : అతిథిగా వచ్చిన నన్ను గౌరవించడానికి నిన్న దేవేంద్రుడు నృత్యగానోత్సవాలు చేయించాడు గదా! నా కళ్లు యథారీతిగా సుధర్మాస్థానంలో నాలుగు మూలలా తిరిగాయి. రంభా, మేనకా, తిలోత్తమా – అప్సరసలు అందరూ కనపడ్డారు. అందరి వెనకా ఒదిగి ఒదిగి నావైపే వేడి వేడిగా చూస్తూన్న ఒక ఉదార సుందర మూర్తిని చూసి నా కళ్లు ఇంక కదల లేకపోయాయి. నా హృదయమూ పొంగి పొంగి కంఠంలోనికి వచ్చి నిలబడి పోయింది. నా అన్వేషణ అయిపోయిందని అప్పుడే తెలిసిపోయింది. ఊర్వశీ!

ఊర్వశి : స్వామీ, వింటున్నాను. కాని రంభకన్న లావణ్యవతి త్రిలోకాల్లో లేదు సుమండీ!

పురూరవుడు : త్రిలోకాల దృష్టి మన్నూ ,చీకటీ, దేహమూను! నా దృష్టి హృదయమూ, ఇంకా లోనిదీనీ. యుగ యుగాలదీ, లోకలోకాలదీ అనుభవము అంతా

సజీవం అయిపోయిన మూర్తినే నేను. దేవిగా శిరసా వహించగలను. ఊర్వశీ! నావైపు తిరుగు. ఊర్వశీ, నా మనస్సులో తొలి మెరపు మేలుకొన్నది మొదలుకొని నీ కోసమే వెదకుతూ ఉన్నానని ఇప్పుడు తెలుసుకున్నాను. ఊర్వశీ! ఇన్ని కల్పాల అన్వేషణలోని వేడీ, నిరాశలోని వేదనా నాలో కనలుతూ ఉన్నవి బైటికి వచ్చి నీ మూర్తిగా అయిపోయినట్లుంది. ఊర్వశీ! ఊర్వశీ! అలాగు చూస్తా వెందుకూ?

ఊర్వశి : స్వామీ! నేను ఏదో అయిపోతున్నాను. లోపల ఏదో పాషాణం మంచులాగ, పాలలాగ కరిగిపోతూంది. ఒక్కసారి నిర్జీవ స్వర్గం కదిలి కదిలి, రెక్కలు తొడుగుకొని మానవత్వంలోకి ఎక్కుతూన్నట్లుంది, ఎగురుతున్నట్లుంది. ఈ క్రొత్త స్వేచ్ఛా, ఆనందమూ నాకు ఊపి రాడనీయడం లేదు. నన్నెందు కిలాగ చేశారు? వద్దు స్వామీ! వద్దు.

పురూరవుడు : ఊర్వశీ! ఈ వేదనే నీ నిలువునా ఉంది సుమా! కోటి కంఠాలతో నన్ను పిల్చింది ఈ వేదనే సుమా! నీ కళ్లు నల్లని నిప్పుకణాలలాగ అవ్యక్తవాంఛలతో కణకణలాడుతూ ఉంటాయి సుమా! నీ ముఖం మీద జారిపడే కుటిల దీర్ఘాలకలు నిట్టూర్పుల్లాగ ఉంటాయి సుమా! ఊర్వశీ! ఒక లావణ్యం శరీరాన్నే పలకరిస్తుంది. ఒక లావణ్యం అంతరాంతరాలని ఆహ్వానించి అల్లలాడిస్తుంది. ఒకటి సౌఖ్యం, అంతే! రెండోది సుఖ దుఃఖాలు పాథేయంగా ఆనందం దగ్గరకి ప్రయాణం చేస్తుంది. శరీర సౌందర్యానికి సుఖాలు కావాలి. అసలు సౌందర్యానికి వేదన కూడా కావాలి. రంభకూ, ఎవ్వరికీ వేదన అంటే తెలియదు.

ఊర్వశి : మీరు అలాగు చూడకండి. అలాగు మాట్లాడకండి. అబ్బా! నిన్నటి నుంచే, నాకూ అనంత వేదనా, హాయీ ఆరంభ మని గ్రహించాను. నా అన్వేషణం కూడా నిన్ననే సొంతం అయిందని తెలుసుకున్నాను. నా కింక భయంకర వియోగ బాధే శాశ్వత భాగ్య మని కూడా నిన్ననే తెలుసుకున్నాను.

పురూరవుడు : నా కర్థం కాలేదు నీ మాటలు.

ఊర్వశి : దేవలోకానికి చుట్టూ ఉన్నంత ఎత్తయిన గోడలు ఏ లోకానికీ లేవు. స్వర్గ ద్వారాలు ఎన్న డెన్నడో కాని తమకు విడిపోవని మానవు లనుకుంటారు. కాని మాకు ఎప్పుడూ విడిపోవు. దేవతలకు మానవలోకం సందర్శించే భాగ్యమూ, దానిలో నివసించే గొప్ప తనమూ ఎప్పుడూ లేవు. అంతే కాదు, నా వల్ల మీకు చల్లదనమూ, శాంతీ రావు. అస లిప్పుడు నేనే వేదనను అయిపోయాను కూడా!

పురూరవుడు : అందుకనే మరీ మరీ మధుర మధురమై పోతున్నా విప్పుడు నాకు.

ఊర్వశి : వినండి. నన్ను పూర్తిగా ఇప్పుడే అర్థం చేసుకోండి. నాశమై నా కాలేని నా బతుకంతా ఇంద్రుని పాదాలకు దేవశాసనం కట్టి వేసింది. అది తలుచుకుంటేనే, మీకు దుస్సహంగా ఉండదూ? ఇంక మా గృహ ప్రాంగణంలో, ఎంద రెందరు సౌఖ్యాతురులు అక్కరలేని అతిథులుగా వచ్చి నిలబడినా, లేదని అననీయదు కాదూ నా జీవిత విధానం? మీరు ఏలాగు సహించుకొని ఉండగలరు?

పురూరవుడు : ఊర్వశీ! నన్ను బాధించకు. నన్నూ నీవు అర్థం చేసుకోలేవు. ఇంక నాకు వేదన వేదనే కాదు. వియోగం వల్ల కలిగే ఏ బాధలోనైనా నీ హృదయం

అంతా ఎప్పటికీ నా దనే హాయి ఏదో నాకు ఇంక బలం ఇస్తుంది. నా ప్రేమకు దారి దొరికిందనీ నా అన్వేషణ అయిపోయిందనీ మాత్రమే నేనంటు న్నాను. ఇంక స్త్రీలు లేరు నాకు. స్త్రీయే ఉందింక! ఇదివరకు నాది బాధ. ఇంక మధుకీల! ప్రేయసీ! ఇంక నేను అసంతృప్తిని. నీవు కోరికవు. నా కది చాలు. రేపే నా మర్త్య లోక ప్రయాణం, సెలవు.

## రెండో రంగము

**ఊర్వశి**

*కాలమే పసిపాప*
*కను విచ్చిన యుషస్సు*
*కలగా కలవరించి*
*వెలుగుగా పులకించి*
*ఇరుల కడు పారసి నే*
*తెరచి వాలిన నాడె*
*మిసిమి వన్నెల మేన*
*మసి జాలిగా నయ్యె*

*తొలి వియోగిని నేనె!*
*తొలి ప్రేయసిని నేనె !*

*ఆనాటి కీనాటి కేను నీ దాననే!*

*మున్నీటి తరగలకు*
*మిన్నేటి నురుగులకు*
*తడయు నెడబా టేనె !*
*విడని కౌగిలి నేనె !*

*వాన చినుకుగ సాగసి*
*వలపు చూపుగ నెగసి*

పడిపోవుదును నేనె !
పరువు విడుదును నేనె !

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !

ఆనాటి కీ నాటి కేను నీ దాననే !

హాలాహలానలమె
అమృత శీతల రసమె
తోడు బుట్టులు నాకు !
తోడు నీడలు నాకు!
నిశి నీలిపెదవిపై
నిట్టూర్పుగా ప్రాకి,
తొలి ప్రొద్దు చెరగులో
పలుకరింతగ సోకి

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీ దాననే!

వేయి వేలు యుగాలు
రేయినై, పవలునై
అడరి కురిసిన యేడ్పు
అలరి విరిసిన నవ్వు
బరువు కానుకగ మన
భాగ్య బంధమ్ముగా
చేర్చుకొని నాలోన
కూర్చుతిని నీ కొరకె

తొలి వియోగిని నేనె !
తొలి ప్రేయసిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీదాననే !

కలకాల మలయకే
నిలువునా తెరమకొని
ఎదు రరయు నీ వలపు
టింటి ప్రాంగణములో

తొలి ప్రేయసిని నేనె!
తొలి వియోగిని నేనె !

ఆనాటి కీనాటి కేను నీ దాననే!

పురూరవుడు : ఎవ్వరది?

ఊర్వశి : ఊర్వశిని!

పురూరవుడు : ఎలాగ రాగలిగావు ఊర్వశీ!

ఊర్వశి : వరం ఇవ్వడం వల్ల వచ్చాను.

పురూరవుడు : ఎవరు ఇచ్చారు?

ఊర్వశి : బృహస్పతి.

పూరూరవుడు : ఎందుకు ఇచ్చాడు? ఎలాగ?

ఊర్వశి : నిన్నరాత్రి త్రిమూర్తులూ అమరావతికి వేంచేశారు. వారిని గౌరవించడానికి దేవగురువులు సుధర్మలో నాటక మాడించారు. దానిలో నాయికనైన నేను శ్రీ విష్ణుదేవుని మీద పాట పాడాలి. దానిలో 'పురుషోత్తముడు' అనడానికి మారు 'పురూరవుడు' అన్నాను. ఇంద్రుడు ఆవేగంతో గడగడ లాడాడు. అప్సరస లందరూ చీరచెరగులు అడ్డుగా ముసిముసి నవ్వులు నవ్వారు. ముక్కోటి దేవతలూ బొమ్మల్లాగ అయిపోయారు. త్రిమూర్తులు కనపడీ కనపడని చిరునవ్వు నవ్వారు. బృహస్పతి చలించలేదు. నేనూ చలించలేదు. "ఊర్వశీ! దేవతలలో రాగూడని పొరపాటు నీలో వచ్చింది. ఇది నీకు తగదు. ఇది

మానవులకు సామాన్యం. నీకు ఎందుకో ఈ మానవత్వం అలవడింది. 'పో! మర్త్యలోకానికి' అని బృహస్పతి శపించారు. నేను చలించలేదు. సరే నన్నాను. నా చెలికత్తెలు కెవ్వు మన్నారు. 'ఎప్పుడో ఎలాగో శాప విమోచనం' అని అన్నారు ఎవరో మెల్లగా వినబడీ, వినబడకుండా. 'మానవ కల్యాణం కోసం, ఊర్వశీ పురూరవులకు ఆయువు జన్మించిన దాకా; ఆయువు మర్త్య స్వర్గలోకాలకు దృఢ నిశ్రేణి' అని గురుదేవులు సెలవిచ్చారు. నేను వచ్చాను.

పురూరవుడు : ఊర్వశీ! నేడు స్వర్గ సౌందర్యమూ, పవిత్రతా అంతా నరక కూపం దాకా అవతరించాయి. ఊర్వశీ! నాకలోకం సౌందర్యం, మానవలోకం ప్రేమ. అవి కలిసి కొన్నప్పుడే మన్నుమిన్నులూ, దివానిశలూ కలిసికొన్న చోటులో లాగ ఎన్ని స్వర్ణారుణ రాగాలైనా వికసించుకుపోతాయి. అటు కాకపోతే రెండూ జీవభాగాలు లేని సిద్ధాంతాలు. ఇటు వచ్చి శరీరం శరీరం అంటేటట్లు కూర్చో- అటు సంధ్యా గగనం వైపు చూస్తూ, విను- ఈ గీతం నాదే, నిన్ను గూర్చే, నీకే అంకితం కూడాను!

*మఘవ మస్తక మకుట మాణిక్యరాజ్ఞి! నీ*
*వెలుగు చూపాక రేయి వికసించి వాసించి*
*మిలమిలా తళతళా మెరసినది కురిసినది*
*పాతాళ భువనాంత పరిసర తమస్సులకు!*

*హాలాహలాంధకా రానల జ్వాలయై*
*కనుమూయనే లేని, కాలిపోనే లేని*
*ఈ నిరాశా వేదనా నగ్న జీవిపై*
*నిలిచినది, పులకలై పులకలై పూచినది!*

కరుణచే వలపుచే తరళమై నా నీవు
బిడియాన నిరులలో బడియేడ్చినా నేను;
ఒరగా ఒరగా నొరుగు నింద్రుని శిరసు
విడిపోయి దిగిపోయి పడినావు నా మ్రోల!

వైకుంఠ మృదుకంఠ వైజయంతీ మాల
తెగనేమొ దిగబారు జగము లన్నీ దాటి!
సురభి సౌదామనిగ తరళ మధుధారగా
ఈశ్వరాలోకమే ఇటు వెడలెనో నేడు!

మూత పడనే లేని ముక్కోటి దేవతల
కనుతారకలు కోరకములై సుమము లయ్యె;
ఓసరిలి యొండొరుల నొరసికొని విరుగబడి
దిశలంట చీకటులు నిశయే దివస మయ్యె!

ఆకాశ సికతాళి నడగి ప్రాకు స్రవంతి
మూడు లోకాలలో మ్రోయు పుణ్యమ్మయ్యె!
నరకలోకపు టింట నవయు శోక తమస్సు
వెలుగు నమృతమ్మయ్యె వీని భాగ్యమ్మయ్యె!

మఘవ మస్తక మకుట మాణిక్యరాశిలో
మరుగు హృదయమ్ములో మండు జీవితములో
మాత్ర మా సమయాన మసకగా మసకగా
మొయిలు కాటుక నీడ ముసురుకొనెనో..
పాపము!

## మూడవ రంగము

పురూరవుడు : శరత్కాలంలో వెన్నెల వర్షిస్తుంది. మిగిలిన కాలాల్లో కాస్తుంది?

ఊర్వశి : అంతే కాదు. మిగిలిన కాలాల్లో వెన్నెల మౌనంగా ఉంటుంది. శరద్రాత్రులలో కళ్లు తెరచుకొని ఏదో చెప్పుతుంది. అది నిద్ర, ఇది పాట!

పురూరవుడు : అంతే కూడా కాదు. ఇతర ఋతువులలో వెన్నెల వెన్నెల మాత్రమే! శారద చంద్రికను మాత్రం గోక్షీరంతో, నురుగుతో, వకుళ వాసనతో, వేణు నాదంతో చేశారు. వెన్నెల చల్లగా మనలోకి ప్రవహించి, నిండిపోతూన్నట్లు ఎప్పుడు ఉంటుందో తెలుసునా, మనలో ప్రేమ తియ్యగా బైటికి పోతూన్నప్పుడు.

ఊర్వశి : మీకు ఇవాళ రాత్రి వెన్నెల బాగుందా?

పురూరవుడు : నీకు హాయిగా లేదూ?

ఊర్వశి : నాకు బాగానూ ఉంది, బాధగానూ ఉంది. నన్ను కూడా మీరూ, మీరిచ్చిన వేదనా, కవయిత్రిని చేశాయి కాదూ? ఈ గీతం వింటారా?

*ఊరకే చలియించు నీ రేయి వెన్నెలలు*
*విరహ వీణా తరళ తరళ తంత్రీ గతుల,*
*ఏ దిగంతాహ్వాన వేదనా రవమేని*
*కలచు తొందరలతో పలుకరించునా కాని,*

*వలిసెజ్జపై మల్లియల రెప్పలే వాల*
*వలయునా బ్రతుకు శయ్యాశాంతిలో తేల,*
*దలన శరదానిలమ్ములు శర్వరీ విరహ*
*సురభి నిశ్వాసములు సాగయించు దశదిశల్!*

పురూరవుడు : ఊర్వశీ! నీ గీతం నా కర్థమవడంలేదీవేళ! ఎందుకో నా మనస్సును కలత పెట్టేస్తూంది. నీ గొంతులో ఏవో దూర దూరాలు, వేరు లోకాలు, వినబడు తున్నాయి. నీ కంఠరవం నా చెవులకి స్థూలంగా

వినబడక, ఆవిరిగానో మబ్బుగానో అయిపోతూ న్నట్లున్నది. నా తల తిరిగిపోతూన్నది. నీ శరీరం అంతకంతకు వెన్నెల రేఖలాగ అగ్రాహ్యమవు తూన్నది. నా తల తిరిగిపోతూన్నది. నీ శరీరం అంతా తడివిచూస్తాను.

ఊర్వశి : నాకూ ఈ కార్తిక రాత్రి కూడా పిలుపు వచ్చింది. నేనింక ఎలాగ ఆగిపోగలను? వెళ్లిపోతాను. ఇలాగ నా దగ్గిరగా రండి. ఇలాగ నా హృదయానికి అదుముకో నీయండి మీ హృదయాన్ని. వద్దు అయ్యో, అలాగ కావద్దు మీరు. ఇంకా దగ్గిరగా, ఇంకా!

పురూరవుడు : ఊర్వశీ! ఊర్వశీ! వెళ్లిపోవద్దు నీవు. నిన్ను వెళ్లిపోనివ్వను. ఇంద్రునికి నేనంటే భయమూ, గౌరవమూను. ఇంద్రుడు నాకు లేదన లేడు, నన్ను ఎదిరించనూ లేడు. నిన్ను వెళ్లనివ్వ నంటాను.

ఊర్వశి : స్వామీ! ఇంద్రుణ్ణే అతని సింహాసనానికి అంటుగట్టి వేసిన లోకైక శాసనం ఉంది. దిక్పాలకులూ, దేవతలూ, బృహస్పతీ, అప్సరసలూ ఎవ్వరూ దానికి విరుద్ధంగా ప్రవర్తించ లేరు. 'ఆ శాసనం ఎందుకూ' అని ప్రశ్నించేటంత తెలివీ, తెలిసికొనేటంత దృష్టీ ప్రతిఘటించేటంత పటిమా ఈరేడు లోకాలలో ఎవ్వరికీ లేవు. అది తెలిసుండే మీ మీద గౌరవం కొద్దీ నా యెడ జాలి పుట్టే శాపం అని నెపం పెట్టి బృహస్పతి నన్నిలాగ పంపాడు. స్వామీ! నేను వెళ్లిపోవాలి.

పురూరవుడు : వద్దు, ఊర్వశీ, వద్దు. నువ్వు వెళ్లవద్దు. నేనింక బ్రతకలేను! ఈ బాధ భరించుకో లేను. నా తల అగ్నికుండమై పోతూంది. నాకు పిచ్చెత్తుతుంది. నాకేమీ తెలియడం లేదు. నే నింక ఏమయిపోతానో

అని భయం వేస్తూంది. నన్ను వదల వద్దు, ఊర్వశీ!

ఊర్వశి : నా దగ్గరగా రండి, ఇలా, ఇలాగ నాకేసి చూడండి. ఇదిగో! ఇలాగ! నా మాట వినరూ? నేనేమి చెయ్యను?

పురూరవుడు : నువ్వు వెళ్లవద్దు. నువ్వే ఇలాగ చేస్తావా? ఎన్ని విధాల అన్నావు నాతో- నేనే కావాలనీ, నా కోసమే నీ బ్రతుకంతా భరిస్తున్నాననీని! ఇంక ఏదీ నీకు రుచించ దన్నావు. దేనికీ నీ హృదయంలో చోటు లేదన్నావు. అయ్యో! ఎంత వెర్రివాణ్ణయి పోయాను! ఇంద్రుడూ, వచ్చి పొయ్యే రాజులూ, నాట్యాలూ, గీతాలూ పాపం! నువ్వు వదలుకో లేవు ఎంత మోసం చేశారు! నీ ఉపకారానికి ప్రతిఫలంగా ఇంద్రుడు నన్నూ రడించడానికి ఈ నాలుగు రోజులూ పంపి నాటకం ఆడించాడు. అది నీకూ అలవాటే కాదూ?

ఊర్వశి : మీరు నన్ను ఏడిపించకండి! నా గుండె బద్దలు చేయకండి. ఇప్పుడు మీ మాటలు వింటే నాకు నిజంగా బాధ దుస్సహంగానే ఉంది. ఏ బాధైనా సరే గాని ఇలాంటి బాధ నాకు వద్దు. మీరే ఇలాగంటే నే నేమవనూ? నాకు మాత్రం చేతనౌతుందా? తప్పని సరిగా కాకపోతే నా కెందుకూ ఆ ఆటలూ, పాటలూను? నేనూ మిగిలిన దేవ వేశ్యల లాంటి దాన్నే అని మీరూ అనుకుంటూంటే, నా కింకే ముంది? ఇంక తిరిగి ప్రవాసంలో పడ్డాక ఏ పూర్వస్మృతులు చల్లగా జ్ఞాపకం తెచ్చుకుని బ్రతక మన్నారు? నా మీద నాకే అసహ్యం అయేటట్లు మీరే మాట్లాడితే – అబ్బా! నా గుండె ఇంకా ముక్కా-ముక్కలైపోదేం? ఎలాగ మీకు నచ్చజెప్పనూ? నా

హృదయం అంతా ఎలాగ మీకు పరిచి చూపించడం? దానిలో ఎవరికైనా అడుగు పెట్టడానికి కూడా వీలులేదని ఎలాగ మీకు నమ్మకం పుట్టే లాగ తెలియజెప్పడం?

పురూరవుడు : నే నింద్రుణ్ణి ఒప్పిస్తాను. నాతో ఉండి పోవాలి. ఊర్వశీ! ఊర్వశీ! ఉండిపోవ్వూ?

ఊర్వశి : స్వామీ! అలాగే ఉండిపోతాను. మీరూ, మీ సంసారమూ, మీ రాజ్యమూ, మీ ధర్మ విధులూ వదలి మీరు రండి, ఇద్దరమూ కలిసి వేరే ఉండిపోదాము. మీకా బలం లేదు. ఆ ఆత్మ విశ్వాసం లేదు. ఎందుకు మీరలా గంటారూ?

# దక్ష యజ్ఞము

## మొదటి రంగము

(నాటి సంధ్యాసమయం. కైలాసాచలం. శంఖధ్వానం మూడు సారులు. ఘంటానాదం కూడాను. కలిసి ఎన్నో గొంతు లన్నట్లు 'ఓమ్ నమశ్శివాయ చ, శివతరాయ చ' అని వీణా మృదంగాది వాద్యాలతో పరమ శివుని ఆనంద నృత్యం)

(ప్రమథ సంకీర్తనము–ఆడగొంతులూ, మగగొంతులూను)

*శివ సాంబశివ, సాంబశివ, శివ శివ!*
*నవ నిశాకర కుసుమ శేఖర!*
*దివిజ గాంగ ఝరీ ధరా! భవ!*
*అభవ దక్షసుతా ధవా! హర!*
*హర హరా హర! హర హరా హర*
*కటక కంకణ కింకిణీ ఘన*
*రణన శింజిత యోగి జన గణ*
*రాజతాచల సానుభవనా!*
*భువన భువనావన! అకారణ!*
*సాంబశివ సాంబశివ శివ శివ!*

(ఓమ్ నమశ్శివాయ చ, శివతరాయ చ' అని ఎన్నో గొంతులు)

దధీచి : ఈ దధీచి జన్మ నేటికి ఫలించింది. ఆహా, ఆహా, అఖిలేశ్వరుడు ఆనందనృత్యం సాగిస్తూ ఉంటే, లోకలోకాలు నిస్తబ్ధమై పోయాయే! శీర్ణవసనులూ, జీర్ణదేహులూ అయిన ఈ ప్రమథుల కన్న ఐశ్వర్యవంతు లెవ్వరు? తామ్రజటలు, పల్లవితామ్ర శాఖల్లాగ ఊగుతూ ఉంటే భుజగ హారాలు లవలీలత ల్లాగ తూగుతూ ఉంటే, చంద్రకోరకం చిరుచిరుగా నవ్వుతూ ఉంటే, అమరగంగ అల్వాల్వంగా తుషారం రాల్చుతూ ఉంటే విశ్వమంతా పరమశివుని మంగళ దేహకాంతులు నిండిపోయాయి.

(శివుడు కైలాసం మీద తాండవం చేస్తుంటే దధీచి చూస్తాడు)

హర నటచ్చరణోప హతి చిట్లి ఎగయును
      మిన్నువరకు వెండి మన్ను దుమ్ము!
సారెకు చంద్రకిశోర సుస్మేర తు
      షారముల్ కడలంటి జారి పడును!
మల మెట్ల ఇరు కెలంకుల నిల్చు ప్రమథ చ
      కోరమ్ము లర్రులు పారజాచి!
నా నుండి వెలువడి నేను శరన్మేఘ
      తూలిక వలె తేలుదును బయల్ల
ఎపుడు మునిమాపు కరగెనో ఎపుడు రజత
నగము మురిగెనో మ్రోల కన్పడదు బైల
అఖిల హరిదంతరాళమ్మునందు నిండి
పండె నా కోసమె అకాల పౌర్ణమాసి

దూరము దూరమై తొలుత తోచిన మువ్వల మ్రోత అంతలో
చేరువ చేరువై ఎడదచేరును, పారును లోన నేరులై
శ్రీ రజతాద్రిపై కొలువు చేకొనకే, దయచేసి, చంద్ర కో
టీరుడు నా హృదంతర కుటీరము లోపలనే నటింపగా!

(ఈ పద్యాలు చదువుతూ ఉంటే చాలా దూరాన ఆనంద నృత్యధ్వనులు వినబడుతూనే ఉండాలి)

నా తండ్రి పరమశివుడు నన్ననుగ్రహించాడు. నేను సెలవు తీసు కొంటాను. ఓమ్ నమశ్శివాయ చ శివతరాయ చ.

## రెండో రంగము

(చాలా దూరం నుంచి మధ్య మధ్య ఎన్నో గొంతులు 'ఓమ్ నమశ్శివాయ చ, శివతరాయ చ' అని అన్నట్లు వినబడుతూ ఉండాలి. కైలాసం – భృంగేశ్వరుడూ, నందికేశ్వరుడూ)

భృంగి : నందికేశ్వరా ! దధీచి ఎంత భాగ్యశాలి!

నంది : దధీచి ఋషి. దధీచి యుగకర్త.

భృంగి : దేవతలకే ఎన్నడో కాని లభించదు కదా, పరమశివుని ఆనంద నృత్య దర్శనం!

నంది : అది కేవలమూ భగవ దనుగ్రహం! మామగారైన దక్షప్రజాపతిని చూడనే లేదు. దధీచిపై దయావర్షం కురిపించాడు తండ్రి. దధీచి శివసంకీర్తనం చేశాక పరమేశ్వరుని శిరస్సు వాత్సల్యంతో రవంత ఒరిగి నప్పుడు, ఆ మహర్షి ఆవంత చకితుడైనట్లనిపించింది. దివిజ గంగ అట్టే -జటాజూటం నుంచి పొరలి ముంచెత్తుతుం దేమో అన్నట్లు !

భృంగి : అవును. ఎంత విశ్వాసంతో, ఆనందంతో వెళ్లి పోతున్నాడో! రావడం ఎంత తీవ్రమైన ఆవేశంతో వచ్చాడు?

నంది : ఆవేశం కాక! దక్షుడూ, అల్లుళ్లూ కలిసి సమస్త సంపదలతో మదించిపోయి లోకాల్ని పీడిస్తున్నారు.

భృంగి : కాటకాలతో, కష్టాలతో ప్రజలు కంకాళాలు అయిపోయారు.

నంది : జగత్తు మహా శ్మశానం అయిపోయింది.

భృంగి : దక్షుడు దురహంకారి. వాడి తామసానికి మితి లేదు.

నంది : తాను బ్రహ్మకొడుకట! ప్రజాపతట!

భృంగి : తాను ప్రజాపతే కాని ప్రజసౌఖ్యం తనది కాదేం? పాపం, దధీచి కరుణావేశంలో స్తిమితంగా ఉండలేక పోయాడు. తమ రక్తమూ, మాంసమూ తిని తిని క్రొవ్వి, కొలువు తీర్చమని తాము దిక్కు మాలిన బిచ్చగాళ్లు అయిపోయారు.

నంది : ఆది భిక్షువు కంతా తెలుసును. భృంగీశ్వరా! భగవంతుడు తరుణం కోసం నిరీక్షిస్తున్నాడు. ఆ తరుణం రావడమూ ఆయన అనుగ్రహమే! ఈ నేరం దక్షుడు ఒక్కడిదే కాదు. దక్షుడు ప్రజాపతి. ఒక మహాయంత్రంలో ఒక చిరు భాగం దక్షుడు. పెరిగి పెరిగి భయంకర రాక్షసిగా పరిణమించిన ఒక పూర్వ విధానం అతనిది. అది పూర్తిగా తుడిచి వెయ్యాలి. కొత్త లోకం కట్టాలి.

భృంగి : మంగళ లోకం, శివలోకం!

నంది : ప్రజాపతి యుగం పోవాలి!

భృంగి : కొత్త యుగం రావాలి!

నంది : అవును. అంతే – తండ్రికి ఆగ్రహ మేమిటి? దక్షుని మీద పగా తండ్రికి? ఎవరు దక్షుడికి ఐశ్వర్యాలు అనుగ్రహించారో వారే వాటిని హరిస్తారు.

భృంగి : దక్షునికి శివదర్శనం కాలేదు, నిర్భాగ్యుడు!

నంది : నిర్భాగ్యుడు!

# మూడో రంగము

(దక్ష ప్రజాపతి నగరు. దక్షుడూ, శతరూపాదేవీ - చాలా దూరాన జనం కోలాహలం లాగ)

దక్షుడు : నిర్భాగ్యుడు తానూ, ఆ బూడిత పూతా, చింపిరి గుడ్డలూను, వెర్రి వేషమున్నూ, అంత కన్న వెర్రి పరివారమున్నూ!

శతరూపాదేవి : అదేమండీ అలా గంటారు?

దక్షుడు : ఎలా గనమన్నావు? ఐశ్వర్యవంతు డనమన్నావా? చంద్రుణ్ణి చూడు. అతన్ని చు డడానికి వెడితే దూరాన్నుంచే ఆ ఎదురు రావడ మేమిటి, భక్తితో ఆ పూజలూ నమస్కారాలూ ఏమిటి?

(పెద్ద తూర్యనాదాలూ, జయధ్వానాలూ, కోలాహలమున్నూ! అధ్వరోత్సవానికి ఎవరో గొప్ప వాళ్లు వచ్చినట్లు)

అడుగో మాటలోనే వచ్చాడు - అధ్వరోత్సవానికి చంద్రుడు పరివారంతో!

శతరూపాదేవి : రోహిణీ, తల్లు లందరూ వచ్చారు.

దక్షుడు : వచ్చారు. కశ్యపుడూ వస్తాడు. కశ్యపుడు మాత్రం? ప్రజాపతే. నా అంత వాడే! మామ గారిని ఎలా గౌరవించాడు! యమధర్మ రాజు, లోక పాలకుడే!

(ఒక్కొరొక్కొరే ఎందరెందరో ఎంతో పరివారంతో మంగళ వాద్యాలతో కోలాహలంతో వచ్చినట్లు)

అమ్మాయి లందరూ వచ్చారు.

శతరూపాదేవి : నాకు సంతోషంగా లేదు. చిన్న తల్లినీ, అల్లుణ్ణీ పిలిపించండి!

దక్షుడు : పిలిపించనా? నేను స్వయంగా వెళ్లి పిలిస్తేనే లేదు. నేను పిలిపించనా? పిలిపించను, పిలవను.

శతరూపాదేవి : ఎందుకు అలా గంటూరు? ఆ పంతం ఎందుకు? ఏం జరిగిం దేమిటి కైలాసానికి వెళ్లినప్పుడు?

దక్షుడు : ఆ! పంతమే! పిలవను, పిలిపించను. ఏం జరిగిందా? ముందు మెట్లకి రెండు ప్రక్కలా ఆయన పరివారం, బిచ్చగాళ్ల దర్శనం. అదే వాలకం, అదే వాటం. ఒక్కడూ లేవడు, పలకడు, ఉలకడు, చూడడు.

శతరూపాదేవి : (నవ్వుతూ) పోనీయండి. వాళ్లు లేవకపోతే మనకేం?

దక్షుడు : (వెటకారంగా) అవును, అలాగే. మనకేం? ఇంక మంటపం ముందు మహానందిగాడు గొరిజలు నేలలో గ్రుచ్చుతూ నిలబడ్డాడు. ఆయనకు నా ప్రసక్తే లేదు. (శతరూపా దేవి నవ్వుతుంది) లోపల శివసభట!. శివసభ! అక్కడ ఎవ్వరికీ నేను వచ్చినట్లే తెలియదు. 'వచ్చారా' అని అయినా అనలేదు ఆయనగారు. నీ అమ్మాయి అసలు తలే తిప్పలేదు.

శతరూపాదేవి : పోనీయండి వెర్రి తల్లి! మధ్యను అదేం చేస్తుంది?

దక్షుడు : పోనిస్తా. ఊఁ అన లేదు సుమా నీ వెర్రి తల్లి సతెమ్మ! ఊఁ అని నిలబడ్డాను. రివ్వున తిరిగి వచ్చేశాను. ద్వారం దగ్గిర కాటకపు కంకాళా లన్నీ హే హే హే అని నవ్వాయి. మహా నందిగాడు మరీ ఆనందంగా నవ్వాడు. ఇదీ అక్కడి ధోరణి. పిలవమన్నావా వాళ్లని?

శతరూపాదేవి : పిలవండి! తప్పకుండా పిలవండి. నాకు బాగా లేదు. ఇందరు ప్రజాపతులూ, ఇందరు రాజులూ ఒకయెత్తు. ఆ అల్లుడొక యెత్తు! అతని ధోరణే వేరు.

దక్షుడు : వేరనే నేనంటున్నాను.

శతరూపాదేవి : చిన్నతల్లి రానిదే ఎంత ఉత్సవం అయినా ఉత్సవం

లాగ ఉండదు. భర్త రానిదే సతీదేవి ఎలాగ వస్తుంది? అమ్మాయిని పిలిపించండి. నా మనస్సు మనస్సులో లేదు. ఏదో భయంగా ఉంది కూడా!

దక్షుడు : (పెద్దగా నవ్వుతూ) భయమా? ఎందుకు భయం? రేపటి విశ్వసభలో ఆ వికృతమూర్తి కనపడడనా?

శతరూపాదేవి : పిలిపించండి. నాకు బాగా లేదు. పోనీ అమ్మాయిని పిలిపించండి. నాకు బాగాలేదు.

దక్షుడు : పిలిపించండి- పిలిపించండి! అలాగే! అలాగే పిలిపిస్తాను. అమ్మాయినే. అంతే, అతణ్ణి పిలవను. నాకు బాగా లేదు, బాగాలేదు, బాగా లేదు! నాకు బాగుందేం? కొండ కొమ్మెక్కి కూచున్నాడు. కోటి మెట్లూ కూపెట్టుతూ ఎక్కానే?

శతరూపాదేవి : అదుగో, రోహిణీ, తల్లులూ అందరూ నగరులోకి వస్తున్నారు. (స్వాగతం ఇస్తున్నట్లు ఏవైనా వాద్యాల సందడి, చాలా తక్కువ సేపు)

## నాలుగో రంగము

(దక్షప్రజాపతి యజ్ఞశాల. విశ్వసభ - దేవతలతో, లోక పాలకులతో, మహర్షులతో! మంగళ తూర్యనాదాలూ, వేద పాఠలూ, స్వాహాకారాలూ వినపడాలి. దూరాన జనం సందడి)

ఒక ఋషి : (సంతృప్తిగా బొజ్జ నిమురుకుంటూ నవ్వినట్లు) హ హ్హహ! దక్షా! ఈ యజ్ఞశాల లోక మోహనంగా విశ్వకర్మ నిర్మించాడు.

దక్షుడు : తమ అనుగ్రహం!

మరొక ఋషి : ఈ అధ్వరోత్సవము మాకు మహానంద దాయకంగా ఉన్నది. నీ జనకుడైన చతురాననుడు స్వయంగా

వేంచేసి ఉండడ మనేది.

దక్షుడు : వారి అనుగ్రహం ఇదంతా!

వేరొక ఋషి : యజ్ఞపురుషుడు సాక్షాత్తూ శ్రీ విష్ణు దేవుడే ఇక్కడికి అనుగ్రహించడం కూడా!

దక్షుడు : భగవంతుని అనుగ్రహం!

వేరొక ఋషి : ఏమి యజ్ఞము, ఏమి యజ్ఞము! మరీచ్యత్రి భరద్వాజాది సప్తర్షులూ ఋత్విజులా? భేష్!

మరొక ఋషి : త్రైలోక్యమూ దక్షిణా ద్రవ్యమే! ఓహోహో భృగువు బ్రహ్మ. అంగీరసుడైన బృహస్పతి ఆచార్యుడు. ఏమి యజ్ఞం!

వేరొక ఋషి : భృగుడూ పూషుడూ సదస్యులు. దిక్పాలకులు రక్షకులు. ధర్ముడూ, చంద్రుడూ, కశ్యపుడూ సహాయులు. ఓహోహో!

మరొకరు : ఓహోహో, కామధేనువు హవిస్సు కల్పిస్తుంది. కల్పవృక్షాలు సమిత్కుశలు సమకూరుస్తున్నాయి. ఏమి మహాధ్వరం! ఏమి మహాధ్వరం!

దక్షుడు : తమ అనుగ్రహం!

దధీచి : (గంభీరంగా) దక్షప్రజాపతీ!

దక్షుడు : ఎవరు?

దధీచి : దక్షప్రజాపతీ! అవును – ఇది మహాధ్వరమేను! అఖిల దేవతలూ అఖిలర్షులూ, అఖిలరాజులూ, అఖిల బ్రాహ్మణులూ, అఖిల నిధులతో ఈ యజ్ఞశాలలో అవతరించి ఉన్నారు. ఈ భారతీదేవే కైవారం పఠిస్తుంది. ఆ లక్ష్మీదేవే అంతఃపుర స్త్రీల నలకంరించింది. అవునా? అవునా? దక్షప్రజాపతీ! ఇది అధ్వరం కాదు.

దక్షుడు : ఎవరయ్యా నీవు?

దధీచి : ఇక్కడికి దయచేసి ఈ యజ్ఞాన్ని కీర్తిస్తూ ఉన్న బ్రాహ్మణులను కనులారా చూసి బ్రాహ్మణుడ నని చెప్పుకోలేకపోతున్నాను. నా పేరు దధీచి.

దక్షుడు : ఏమిటా లోపం, ఈ యజ్ఞంలో. అయ్యా! ఆవేశ మెందుకు! సెలవియ్యండి.

దధీచి : సెలవిస్తున్నా.

సతీదేవి : (హఠాత్తుగా లేచి) నేను సెలవిస్తున్నా, అయ్యా! దధీచీ! నీ వాగు. ఇంక నేను దక్షప్రజాపతి కూతుర్ని కాను. దధీచీ! నీ వాగు. దక్షప్రజాపతీ! నాకూ ఆవేశం లేదు. ఆవేశం ఎందుకు నాకు? ఉత్సవాన్ని సందర్శించే ఆనందంలో ఊగిపోతున్నాననా ఆవేశానికి?

దక్షుడు : ఇది ఆవేశం కాక మరేమిటి? సతీ! ఒళ్లు మరచిపోయి ఏమిటీ? ఈ యజ్ఞంలో వచ్చిన ఒచ్చె మేమిటి?

సతీదేవి : పరమ శివుడు ఇక్కడ ప్రత్యక్షం కాకపోవడం కన్నా ఒచ్చె మేముంది?

దక్షుడు : అది లోపమని నీకు తోచింది; కాదని మాకు తెలుసు.

సతీదేవి : నీవు మహేశ్వరుణ్ణి ఆహ్వానించావా?

దక్షుడు : ఎందుకు పిలవాలి? కశ్యపుడు లాగ ప్రజాపతనా? చంద్రుడులాగ చక్కని వాడనా? ఎందుకు నీ భర్తను పిలవడం? యముని లాగ లోకపాలకుడనా?

సతీదేవి : అందుకనీ కాదు, నీ అల్లుడనీ కాదు. అఖిలేశ్వరు డని. అఖిలేశ్వరు డని పిలువమన్నాను. ఈ చంద్రుణ్ణి త్రుంపి, చింపి, సిగలో బంధించిన వాడని.

ఈ యముణ్ణి డాకాలి మడమతో తన్ని అల్లలాడించిన వాడని. నీ తండ్రి బ్రహ్మ శిరస్సు గోరు ముక్కుతో గిల్లిన వాడని. ఈ విష్ణుదేవు డతని వామాంగమని! ఎందుకు పిలవమన్నానా?

దక్షుడు : నీ కెంత అహంకారం వచ్చింది? నిన్ను నీవే మరచిపోయి మాట్లాడుతున్నావు. అఖిలేశ్వరుడా? పూజ్యుల్ని గౌరవించని అహంకారా? ఈ విశ్వసదస్సు నాలుగు మూలలా కలయచూడు. ఈ సభలో ఆ అమంగళ వేషధారిని కూర్చుండబెట్టనా? వాడి కుల మేమిటి? గోత్ర మేమిటి? పురుషుడా, స్త్రీయా వాడు? చెప్పు. ఏమని కూర్చుండ బెట్ట నిక్కడ?

సతీదేవి : అవన్నీ అని ...దక్షా, నీ మీద జాలివేస్తూంది. శివుడు పరమేశ్వరుడు!

దక్షుడు : ఓహో! పరమేశ్వరునికి కూడు లేదూ, గుడ్డలేదూ? చింకిపాతలా, బూడిద పూతలా? పుర్రెల దండలూ, తన లాంటి దిక్కుమాలిన పరివారమూనా?

సతీదేవి : అయ్యయ్యో, అయ్యయ్యో! (జాలిగా అన్నట్లు) దక్షప్రజాపతీ, నీవు అంధాంధుడవు. తాను బిచ్చమెత్తి, విషం మేసీ, నీకూ వీరికీ అష్ట ఐశ్వర్యాలూ ఇచ్చాడే! "శివుడే దాత, శివుండె భోక్త శివుడే చేయున్ మఖాది క్రియల్" అన్నారే ఋషులు! నీవు చేస్తున్నావా ఈ యజ్ఞం? నీవా? నీవే? దక్షా, నీవే చేస్తున్నావా? నీవే?

దక్షుడు : ఒళ్ళు మరిచిపోయి నీవు అలాగే మాట్లాడతావు!

సతీదేవి : హరుడే భోక్త. భర్గుడు భోగ్యము, శివుడు ప్రేరితము అని శ్వేతాశ్వతరోపనిషత్తు ఘోషించలేదూ? ఈ ఋషులు మాట్లాడరేం? మునులు కనుక మౌనం. పోనీ దక్షా, ఈ సభకు చీనిచీనాంబరాలూ

రత్నకాంచన భూషణాలూ ధరించిన ఈ పదిమందే కాని కోటాను కోట్లు నీ కోసం శ్రమించి తమ రక్తమజ్జాస్థి మాంసాలను నీకు తినిపించి తాము కంకాళాలై దిగంబరులై దిక్కులేని వారై తిరిపమెత్తే వారైన ప్రమథులు కోటానుకోట్లు ప్రజలందరూ రానక్కర లేదూ? ప్రజాపతి, ప్రజాపతట! ప్రజానేత శివుడు, నీవు కావు. ప్రజకి దూరుడ వయావు కనుక ప్రభువుకి దూరుడ వయావు.

(దూరాన్నుంచి వినపడుతూన్న ప్రళయ ప్రజా కోలాహలం. మధ్య మధ్య దగ్గరగా వస్తూ, దూరంగా పోతూ, రేగుతూ, చల్లారుతూ డమరుకం, పెద్ద డోళ్ళ నాదాలు, శంఖధ్వానాలు. కాని ఇంకా ఇవి పూర్తిగా దగ్గరగా రావు. దూరాన ఈ చప్పుళ్లు శ్రుతిగా నందికేశ్వరుడూ, దధీచీ మాట్లాడుతారు. మాటలు స్పష్టంగా వినపడాలి.)

దధీచి : నందికేశ్వరా, నందికేశ్వరా!

నంది : దధీచీ, తరుణం వచ్చింది. చూడు ప్రమథ సాగరతరంగాలను. కైలాస శిఖరం నుంచి దక్షయజ్ఞ పాతాళం దాకా పరవళ్లు త్రొక్కుతూ వస్తున్నాయి. రురుడు, కపాలి, క్రోధనుడు మొదలైన ఉన్మత్త భైరవులు నడిపిస్తూ ఉన్న బిచ్చగాళ్ల మహా సైన్య మదిగో! అదిగో దధీచీ! లలజ్జిహ్వుడు, జ్వాలా నేత్రుడు, ఖర్వగ్రీవుడు, జ్వలితకేశుడు మొదలైన అసంఖ్యాక భూతబేతాళకోటి. దధీచీ, చూస్తున్నావా? విఘ్నేశ్వరుడు, షణ్ముఖుడు తోసికొని వస్తున్నా, మహాభూత మహాసముద్రం, శతనేత్ర సహస్రాస్య మొదలైన శక్తులు బయలుదేరాయి. వీరందరినీ ఆవహించి, దధీచీ, చూడు దృశ్యాదృశ్యంగా వెలిగిపోతూన్న, దుర్నిరీక్ష్యమైన ఆ విలయా గ్రహమూర్తిని వీరభద్ర ప్రభను!

(పాట దగ్గరగా వస్తుంది)

అగ్ని వీణలు మ్రోగెరా, ఆకాశ నేపథ్యమున మానవ
భుగ్నకాయ మ్మాయెరా – వెను

బూది పారలెడు పేదపురువులు
రుద్ర నేత్రము త్రిప్పుకొని, ఉ
న్నిద్ర నేత్రము విప్పుకొని, అట
వీరభద్రుడు తరలగా, వెను వెంట రాణువ కదలగా!

కేల కేల త్రిశూలమూ ప్రతి
ఫాలమున నాభీల కీల
శీర్ణ వసనులు జీర్ణవపువులు
ఘూర్ణిత ప్రళయార్ణవముగా .... అగ్ని

నీ దగ్గర ఇంక ఐశ్వర్యం ఎలా గుంటుంది? ఇక్కడే, ఇప్పుడే, నీ కన్నుల ముందే నిన్ను వదలి బూడిదై పోతుంది. నేను పోతున్నా.

(పెద్దగా హాహాకారాలు చేస్తున్నట్లూ, ఏడుస్తున్నట్లూ వాద్యాలూ, పెద్ద గోలా)

దుష్టఫణి తంత్రీ నిబద్ధ ని
కృష్టకర్కశ కపాలమ్ములు
పటు గమన వేగమున నొరయుచు
కిటకిటా ఫెట ఫెటా మ్రోయగ ...అగ్ని

(శంఖం, గంట, కోలాహలం, డోళ్లు)

దధీచి : నందికేశ్వరా, ఒక్కొక్క ప్రమథుడు ఒక్కొక్క కాలరుద్రుడై తాండవిస్తున్నాడు. దక్షుడూ, దక్ష బాంధవులూ ఈ ప్రళయ కోలాహలము వినలేదా? వినరు.

నంది : వినరు. ప్రజాపతులూ, లోక పాలకులూ ఈ ప్రళయ ఘోష దధీచీ,యుగాంత సూచనలు ఎంత స్పష్టంగా గోచరిస్తున్నాయి. పురాతన జీర్ణ మందిరా లేవో,

ఫెళ ఫెళా కూలి ధూళిలో పడిపోతూన్న ధ్వనులు నీకు వినపడడం లేదూ? ఆ ధ్వనులతో కలిసి చెదరిపోతూన్న చీకట్ల మూలుగూ, దరిసి వస్తూన్న రాకాసి ఎలుగూ వినబడడం లేదూ? దక్షుడూ, దక్షబాంధవులూ మాత్రం వినరు, వినరు.

రాకాసి యెలుగు,
చీకట్ల మూలుగు,
కాలదేవత గుండె ఒరిసి,
కాళ రాతిరి నెత్రు కురిసి
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు
లోన –
వన్నెపోయిన రంగు దీపాల
చిన్నెల్లో ఉన్మత్త నాట్యాలు
వినుగుపుట్టీ విడరు
వీను లుండీ వినరు
దగ్గరగ – దగ్గరగ
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

రెక్క తెగరని నెమలి సింహాసనం
ఎక్కి శిర సందనిది కోటీరం
భారమైనా విడరు
చేరువైనా వినరు
దిగ్గరగ – దిగ్గరగ
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!
లోన –
రాణపోయిన రాచనగరులో

పానుపంటని వేడి నిదరలో
మెలకువొచ్చీ విడరు
విలయ మొచ్చీ వినరు
దగ్గరగ – బిగ్గరగ
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

పైన –
కాళరాతిరి గుండె పగిలి
కాలసర్పము విషము రగిలి
చీకట్ల మూలుగు
రాకాసి యెలుగు!

దధీచి : ఎన్నివేల యేళ్ల ఆగ్రహమూ, పగా, ఈ సమయంలో
కట్టతెగి లోకాలని ముంచెత్తుతూంది!

ప్రమథులు : తమ కమృత ముంచుకున్నారు
తమ మధువు నించుకున్నారు
మాకు ఆకలి నిచ్చి
మాకు కోపం హెచ్చి
మందాకినీ ఝురుల్
మరుగర్భమం దింకు వరకు ... తమ
తమ సొగసు వాడి పోదంట
తమ సుకము వేడి పోదంట
మాకు నాశము నిచ్చి
మాకు ద్వేషం రెచ్చి
మందార తరులు, హే
మంత మసనమ్మందు వరకు ... తమ
తమ ఘనత కృతయుగము దైతే
తమ ప్రభుత బ్రహ్మయువైతే
మాకు సంకెళ్లిచ్చి

మాకు మానం వచ్చి
మఘవ కోటీరమే
మంటి కౌగిలి నంటు వరకు ... తమ

నంది : దధీచీ! మహాశ్మశాన వాసులైన భూతబేతాళ కోటులు యజ్ఞశాలను సమీపించారు. నీకూ ప్రమథాకారం వచ్చింది. మహాభాగ్యం నీది.

(ప్రమథుల పాట దగ్గరగా, బిగ్గరగా, కసిగా, భయంకరంగా)

బురదలో పొర్లేటి పురుగు
కరమెత్తి పయనమై వస్తే
గుళ్ళల్లో, కోటల్లో
కుళ్ళిపోయే స్వార్థం,
త్రుళ్ళిపడి ఒక్కటే పరుగు
బురదలో పొర్లేటి పురుగు
శివమెత్తి పరికించి చూస్తే
కొండపై మింటిపై
కునుకుతున్నా దైవం
ఉలికిపడి క్రిందికే ఒరుగు!

నంది : దధీచీ, ! దధీచీ!

దధీచి : నందికేశ్వరా !

(ప్రమథులు యజ్ఞశాల మీద పడుతూ పాట. శంఖం, ఘంట నాదం రేగిపోవాలి. పాట మాత్రం వినపడుతూ ఉండాలి)

ఆకాశమున నెత్తురు జెండా లోయి
లోకాన రాకాసి దండోయి!
ఏకాకు లొత్తిగిలి పాండోయి
ఆకొన్న రాకాసి దండోయి!

పానుపంటని వేడి నిదరలో
మెలకువొచ్చి విడరు
విలయ మొచ్చి వినరు
దగ్గరగ - బిగ్గరగ
రాకాసి యెలుగు
చీకట్ల మూలుగు!

పైన -
కాళరాతిరి గుండె పగిలి
కాలసర్పము విషము రగిలి
చీకట్ల మూలుగు
రాకాసి యెలుగు!

దధీచి : ఎన్నివేల యేళ్ల ఆగ్రహమూ, పగా, ఈ సమయంలో
కట్టతెగి లోకాలని ముంచెత్తుతూంది!

ప్రమథులు : తమ కమ్మ్రత ముంచుకున్నారు
తమ మధువు నించుకున్నారు
మాకు ఆకలి నిచ్చి
మాకు కోపం హెచ్చి
మందాకినీ ఝురుల్
మరుగర్భమం దింకు వరకు ... తమ
తమ సొగసు వాడి పోదంట
తమ సుకము వేడి పోదంట
మాకు నాశము నిచ్చి
మాకు ద్వేషం రెచ్చి
మందార తరులు, హే
మంత మసనమ్మందు వరకు ... తమ
తమ ఘనత కృతయుగము దైతే
తమ ప్రభుత బ్రహ్మోయువైతే
మాకు సంకెళ్లిచ్చి

ఫెటా ఫెటా రటన నటేశ్వరా జయ నటేశ్వరా!
కటికంఠధృత కాకోదర
సట ఘటా ఘటిత దుర్ధర తర కర్పర
పటు కఠోర కర హర హుంకారో
చ్చటులాంధాంధ క్షపాట పాటన !
నటేశ్వరా! జయ!

(ఒక్క చిటిక నిశ్శబ్దం)

శ్రీగళుండు కృపారస శ్రీపయోధి
ఫణిఫణా కుండలుండు విశ్వగృహమేధి
కట తటీ వాసి నిత్య నికట నిధాన
మలిక నేత్రుండు శివుడు మా అమర తరువు!

నొసలు కన్ను కొలిమి రుసరుస మన నేమి
రెండు కనులు సుధలు నిండియురలు!
వాని ఆగ్రహమ్ము వాని అనుగ్రహ
మెండ వాన లగుచు ఏలు మమ్ము!

ఎట్టి దక్షుడేని ఎట్లు విపక్షుడు
కాగలాడు ప్రేమ సాగరునకు?
తండ్రి కాన మమ్ము దండించు పండించు
భవ భవాల పుణ్యపాళి భవుడు!

కొందరు కలిసి: అసతో మా సద్గమయ
తమసో మా జ్యోతిర్గమయ
మృత్యోర్మామృతం గమయ

# ప్రపన్న పారిజాతము
## (భగవద్రామానుజుల గాథ)
## మొదటి రంగం

[కంచిలో వరదరాజ స్వామి వారి ఆలయ మంటపంల' రామానుజులూ, అనుచరులూ]

**రామానుజులు :** ఏం వరదదాసా! ఏదీ తిరుమొళిశై ఆళ్వారు అనుగ్రహించిన ఆ పాశురం?

**వరదదాసు :** కణికణ్ణన్ పోహిన్రాన్
కామరు పూంగచ్చి
మణివణ్ణా నీ ఇరక్క వేండాం
సెన్నాప్పులవన్ నానుమ్
పోహిన్రేన్ నీయుం ఉండన్
పైణ్ణాహప్పాయి సురులిక్కాళ్

**రామానుజులు :** చెన్నా, విన్నావా! పెరుమాళ్లు భక్తులకు ఏ విధంగా అధీను డాయెనో.

**చెన్నుడు :** ఈ ప్రబంధాన్ని ఆళ్వారు లెప్పుడు సెలవిచ్చారో ఆ గాథ వినిపించండి.

రామానుజులు : [ఆనందంతో] అలాగే! తిరుమొళిశై యాళ్వారులవారి బహిఃప్రాణం వారి శిష్యుడు కణికణ్ణన్. ఆ పురి ఏలేటటువంటి పల్లవరాజున్నాడే, అతగాడు ఒకనాడు "అయ్యా, కణికణ్ణన్! నీవు మహాకవివి గదయ్యా, నన్ను కీర్తిస్తూ ఒక కావ్యం వ్రాయవయ్యా" అన్నాడు. కణికణ్ణన్ "ఎంతమాట అన్నావు పల్లవ రాజా! ఏంకోర్కె కోరావు? పెరుమాళ్లను వర్ణించిన నాలుక పెరవాళ్లను కీర్తిస్తుందా?" అని చక్కా వచ్చాడు. పల్లవ రాజు ఆగ్రహం పట్టలేనివాడై కణికణ్ణన్‌ని 'కంచి నుంచి పో' మ్మని శాసించాడు. కణికణ్ణన్ ఈ సంగతిని తన స్వామి ఆళ్వారులతో మనవి చేసుకున్నాడు. అప్పుడు వారు పాయించిన దీ పద్యం. ఏదీ, వరదదాసా! ఒక్కొక్క పాదమే మళ్లీ చదువు.

వరదదాసు : కణికణ్ణన్ పోహిన్రాన్, కామరు పూంగచ్చి

రామానుజులు : ఆఁ ఆగు. ఈ సర్వ కామితార్థా లనే దివ్య కుసుమాలతో నిండిపోయిన ఈ కంచి నుండి కణికణ్ణన్ పోతున్నాడు. ఊఁ.

వరదదాసు : మణివణ్ణా నీకిరక్క వేండాం.

రామానుజులు : సుందరాతి సుందరమైన మూర్తి గలిగిన ఓ ప్రభూ! నీవిక్కడ పవ్వళించ నక్కరలేదు. తరవాత?

వరదదాసు : సెన్నాప్పులవన్ యానుమ్ పోహిన్రేన్

రామానుజులు : ఆహాఁ...... అంటే ..... ఈ దివ్యమైన ఉజ్వలమైన రసన గలిగిన కవిని నేను కూడా పోతున్నాను. ఊఁ?

వరదదాసు : నీయుం ఉండన్ వైన్నా హప్పాయి సురులిక్కాళ్

రామానుజులు : అంటే యేమిటీ .... స్వామీ! భక్తాధీనా, నువ్వు పవ్వళించిన శేషతల్పాన్ని కూడా చుట్టచుట్టి

బయలుదేరవయ్యా .... అని ఆళ్వారులు హెచ్చరించడమున్నూ, కణికణ్ణన్‌తో తాము కంచి నుంచి బయలు దేరడమున్నూ, వారితో పెరుమాళ్లు శేషశయ్యను చుట్టచుట్టి చంకబెట్టి వేంచేయడమున్నూ జరిగింది. మరేముంది? .... పల్లవరాజు మతిపోయింది. ఆళ్వారుల శరణు జొచ్చాడు. ఇదీ గాథ. ఏ పట్టపు రాజైనా పరమ భాగవతుల పటిమ ముందు ఆగగలడా?

గోవిందుడు : అన్నా! రామానుజా!

రామానుజులు : ఏం గోవిందా? ఇలా వచ్చావు?

గోవిందుడు : గురుదేవులు యాదవ ప్రకాశుల సెలవయింది. నీవు రావాలి.

రామానుజులు : వస్తున్నా.

చెన్నుడు : రామానుజా, మీరు వెళ్లవద్దు.

రామానుజులు : చెన్నా, నీ వలా అనకూడదు. గురుదేవుల ఆజ్ఞ ఎప్పుడూ మనకి శిరోధార్యము.

చెన్నుడు : ఆయనకు మీమీద చాలా ఈసు.

రామానుజులు : తప్పు,అన్నా! యాదవ ప్రకాశులు సామాన్యులనుకొన్నావా?

స్వమత స్థాపన శక్తి అన్యమత విధ్వంస
క్రియాసక్తి స
ర్వ మనీషి స్తవనీయ శాస్త్ర పటలీ పాండిత్య
సంయుక్తియున్
యమ ముఖ్యాఖిల యోగధారణ సముద్యత్
ప్రౌఢిమవ్యక్తి ఈ
శ మహాభక్తి ......

కలిగిన లోకోత్తరులు యాదవ ప్రకాశులు. గోవిందా! నడు.

[వాద్య సంగీతం]

[యాదవ ప్రకాశుల ఇల్లు. యాదవ ప్రకాశులు. ఆయనకు అభ్యంజనం చేయిస్తూ రామానుజులు]

యాదవ ప్రకాశులు : రామానుజా! శిష్యులందరిలో నీవంటే మా కెక్కువ ఇష్టం.

రామానుజులు : చిత్తం.

యాదవ ప్రకాశులు : నీది మహ నిశితమైన మేధ, చక్కని స్వభావమూను!

రామానుజులు : తమ అనుగ్రహం. అలా సెలవీయవద్దు.

యాదవ ప్రకాశులు : [ప్రగల్భంగా నవ్వి] నీకు మాయెడ కూడా భక్తి తాత్పర్యాలున్నాయి. మేం ప్రచారం కావిస్తూన్న సత్యమతస్థాపన మంతా ఇకపైని నీ ద్వారా కావలసి ఉంది.

రామానుజులు : ధన్యుణ్ణి!

యాదవ ప్రకాశులు : ఏదీ – ఇందాకటి శ్రుతి – 'కప్యాస పుండరీకాక్ష' దానికేమర్థం చెప్పాము? మర్కటాసనముతో సమానమైన విలోచనములు కలవాడు అని. అవునా?

రామానుజులు : [దుఃఖంతో] ఆఁ. ఆఁ. గురుదేవా! అపచారం, అపచారం!

యాదవ ప్రకాశులు : ఏమిటా అపచారం?

రామానుజులు : శ్రుతికి అపార్థాపత్తి అపచారం కాదా స్వామీ! నీటిలో పుట్టి సూర్యరశ్మిచేత వికసించిన పద్మాల వంటి నేత్రాల వాడనడానికి మారు విపరీతమూ భయంకరమూ అయిన –

యాదవ ప్రకాశులు : చాలులే! నేను చెప్పిన అర్థమే సరి.

రామానుజులు : కాదు.

యాదవ ప్రకాశులు : [కోపంగా] అదే సరి.

రామానుజులు : కాదు [తీవ్రంగా]

యాదవ ప్రకాశులు : అవురా రామానుజా! నాకన్న పండితుడ వయ్యావే? ఆచార్యునకు పంగనామాలు పెట్టే అఖండ శేముషిని సంపాదించావే!

రామానుజులు : నేనలా అనుకోవడం లేదు. నేనెప్పుడూ తమ శిష్యపరమాణువునే. అయినా ఆచార్య ద్రోహమైనా చేస్తాను గాని ఆత్మ ద్రోహం చేసుకోలేను.

యాదవ ప్రకాశులు : అవురా నీది నక్క వినయమూ, పిల్లి శీలమూ, అని నాకు తెలియలేదు. పో, బయటికి పో, నా యెదుటి నుంచి!

[వాద్య సంగీతం]

## రెండో రంగము

[కంచిలో – వీధిలో – యాదవ ప్రకాశుల శిష్యులు]

శ్రీశైలం : సోమయాజీ ఆగు. ఆగ మంటున్నాను. ఎక్కడికి పోతున్నావు?

సోమయాజి : రామానుజుల ఇంటి కయ్యా, శ్రీశైలం!

శ్రీశైలం : మళ్లీ రామానుజుల ఇంటి కేమిటయ్యా? ఇది మూడోసారి వాడు గురువుల్ని ధిక్కరించడమూ,

పోవడమూను. సాగనంపడం, స్వాగత మివ్వడం. ఇదీ గురువుగారి పని. వాడు గోముఖవ్యాఘ్రం.

సోమయాజి : వాడిది నక్క వినయం.

శ్రీశైలం : వాడిది పిల్లి శీలం, పింగళాజవమున్నూ.

సోమయాజి : వాడిది వట్టి బక ధ్యానం.

శ్రీశైలం : ఏదో పెద్ద తెలివితేటలున్నట్టూ, మహా మంచి వాడిలాగా మొహం పెట్టి, ఏదో మహా పెద్ద ఇది లాగ ....

సోమయాజి : అయితే ఇప్పుడు రామానుజుల దగ్గిరికి ఎందుకు వెడుతున్నానో తెలుసా? వాణ్ణి పన్నిద్దరాళ్వారుల దగ్గరకి పంపెయ్యడానికి ....

శ్రీశైలం : అదేఁవిటి – ఆఁ. బాగుందే –

సోమయాజి : హారి వీడి హరిభక్తి కూల! వీడి సంగతి గురువుగారికీ తెలిసిందిలే. ఇప్పుడు గురువుగారి కాశీ ప్రయాణం లేదూ? రామానుజుల్ని కూడా బయలుదేర మంటున్నారు.

శ్రీశైలం : ఆఁ. అయితే!

సోమయాజి : అందరం బయలు దేరతాం. కాశీ కావిళ్లా మనమూను. తోవలో అడవులూ వస్తాయి, కొండలూ వస్తాయి.

శ్రీశైలం : నదులూ వస్తాయి, లోయలూ వస్తాయి. విషయం ఏమిటో చెపుదూ చంపక!

సోమయాజి : [నెమ్మదిగా] తోవలో ఏ వింధ్యారణ్యంలోనో, ఏ పులికో, ఏ తోడేలుకో నివేదనంగా [నవ్వుతాడు]

శ్రీశైలం : నివేదనంగానే? రామానుజుల్నే? ..... [నవ్వుతూ] నాకు ఒళ్లు మండిపోతోందిలే!

సోమయాజి : అందుకనే రా, కంపానదిలో మునగడానికి పోదాం.

[వింధ్యాటవుల్లో]

[రామానుజులూ - తమ్ముడు గోవిందుడూ]

గోవిందుడు : [నాక్కున గొంతుతో] అన్నా - అన్నా -

రామానుజులు : ఆఁ. ఎవ రది? ఏం గోవిందా?

గోవిందుడు : ఆగు, ప్రమాదం,. నువ్వింక ముందుకు వెళ్లొద్దు.

రామానుజులు : అదేం గోవిందా? గురువులూ వారూ ఏరి?

గోవిందుడు : ఆ గురువులు చేసిన పనే ఇది. కాశీ ప్రయాణ మనే మిష పెట్టి, ఈ వింధ్యారణ్యానికి నిన్ను బలి ఇద్దామని. నన్ననుమానిస్తారు. నేను పోతాను. నువ్వు తప్పి పోయావని చెపుతాను. అనుకున్నంత పనీ అయిందని సంతోషిస్తారు. పోతా .... ని న్నాభగవంతుడే రక్షిస్తాడులే!

రామానుజులు : తమ్ముడూ! ..... గోవిందా! (నవ్వి) హుఁ - వెళ్లిపోయాడు. (మళ్లీ నవ్వి) ఏమి టీ వింత? పాపం ఈర్ష్య ఎంత పని చేయిస్తుంది? చెన్నయ్యన్నాడు కూడా వద్దని. అయినా గురువుల కపచారం తలపనైనా కూడదు. ఇప్పు డెక్క డున్నానో ఏమో? ఎటు పోవాలో ఏమో! నా తండ్రి వరదరాజస్వామిదే భారం. చీకటి పడుతోంది. ఈ కీకారణ్యంలో నాకు భయమే వెయ్యడం లేదు. ఎక్కడ లేడు నా వరదుడు - నన్ను కాపాడటానికి? తండ్రీ, వరదయ్యా! అమ్మా పెరిందేవీ! ... పెరిందేవీ! వరదరాజస్వామీ!

రామానుజులు : ఎవరది? చీకటులు ఒత్తిగించుకుంటూ ఆ వచ్చేది?

మగచెంచు : ఓ .... ?

రామానుజులు : అయ్యా, మాది కంచి. కాశీయాత్రకు పోతూ కారణాంతరాల వల్ల ఇక్కడ డాగాను. మీ రెవరు?

ఆడ చెంచు : మే మెరకల వాళ్లం.

మగ చెంచు : నాపేరు ఓబళేశు.

ఆడచెంచు : నాపేరు లచ్చి.

రామానుజులు : నాపేరు రామానుజుడు. మీరెక్కడికి పోతున్నారు?

మగ చెంచు : కంచి వరదయ్య కొలువుకి.

ఆడ చెంచు : పెరిందేవమ్మను చూడాలని.

రామానుజులు : నేనూ వారిద్దరినీ చూడాలని వెడుతున్నాను.

ఆడ చెంచు : భక్తులు పిలుత్తే ఆరే వత్తారంటగా –

రామానుజులు : నేను అంతటి భక్తుణ్ణి కానమ్మా!

మగ చెంచు : కుయ్యో మని పిలిస్తే గొబ్బున పరుగెత్తుకొని వత్తాడంటగాదూ వరదయ్య! మా సోములోరు చెప్పాడు.

రామానుజులు : అట్లాగే పిలుస్తా నయ్యా.

ఆడ చెంచు : ఈ అడవుల్లో మెకా లున్నాయని భయం లేదూ?

రామానుజులు : మీ రున్నారు గదమ్మా, భయం ఏమిటి?

మగ చెంచు : అవును, భయం లేదు. మేం ఉన్నాం. ఈ సెట్టు కింద పడుకుందాం. దా, ఈ రేత్రికి.

(విరామం)

ఆడ చెంచు : వొయ్యోయ్! నాకు దాగం ఏత్తంది.

మగ చెంచు : ఆడ మద్దితోపు యెనకాల మంచి బావుంది. చల్లంటి, తియ్యంటి నీరు. ఈ సీకట్లో యెత్తే తప్పోతాం.

రామానుజులు : అయ్యా, మీరు వెళ్లవద్దు. నేను పోయి తెస్తా.

కొంచెం వెలుగు వస్తే ...

(కొంచెం విరామం)

ఆడ చెంచు : ... వాయ్యోవ్. దాగం!

రామానుజులు : అమ్మా, వెడుతున్నాను. వెలుగు కూడా వచ్చేటట్టుంది. మీ రెవరో కాని మీరు వచ్చినప్పటి నుంచీ రాత్రి భయపడినట్లు పరుగెత్తుతోంది. .. ఆ మర్ది తోపు వెనకాలేగా – పోయి వస్తా.

(విరామం)

ఆడ చెంచు : అహో, మన యెడల ఎట్టి భక్తి తాత్పర్యాలు!

మగ చెంచు : [వారిస్తూ] అడుగో నీటితో వస్తున్నాడు.

రామానుజులు : అమ్మా, దోయిలి పట్టు .....

ఆడ చెంచు : (తాగి) అబ్బా! దాగం తీరలేదు.

రామానుజులు : పోయి మళ్లీ తెస్తా నమ్మా

(విరామం)

మగచెంచు : అతనొచ్చేలోగానే మనం మాయమై పోదాం. వెలుగు బాగా వచ్చేసరికి కంచి పరిసరాల్లో ఉన్నట్టు అతనికే తెలుస్తుంది.

(సంగీతం)

రామానుజులు : ఏరీ, ఎరుకు దంపతులు? అమ్మా! మంచినీళ్లు తెచ్చాను. ఏ మీ వింత? ఎంత త్వరగానైనా కనుచూపు మేర దాటిపోలేరే! ..... ఆఁ. తెలిసింది. నా తండ్రీ, వరదయ్యా, తెలిసింది .... అమ్మా, పెరిందేవమ్మా, నీ అనుగ్రహం. తెలిసింది! ఓహో! అ దేమిటీ? ఆ వింధ్యారణ్యం ఈః మావితో పయిందేం? ఇది నే నెరిగున్నదే .... అదుగో వేగవతి. అదే యథోత్కారి

ఆలయ గోపురం. అరరే! అది వైకుంఠ పెరుమాళ్లు కోవెల. అదిగో నా తండ్రి వరదరాజ స్వామి మందిర గోపురం! ఆహా! .... ఏమి టీ భగవల్లీల!

నాగాచల నివాసాయ నిత్యాయ పరమాత్మనే ॥
వరదా య్యాప్రమేయాయ గోవిందాయ మహాత్మనే

తల్లీ, నీదీ ఈ అకారణ వాత్సల్య మంతా నీది. మా అమ్మవు కావూ?

*శ్రీ భాగ్యరేఖా ముపపాదయంతీం*
*శివంకరీం సింధుర మందయానామ్।*
*శీతాంశు బింబ ప్రతిమాన వక్త్రాం*
*క్షీరాబ్ధి కన్యాం శిరసా నమామి!*

*సరోజ హస్తే ! సకిరీట మస్తే!*
*సమస్త కల్యాణ గుణ ప్రశస్తే*
*హృద్యేఽ నవద్యే శరణం ప్రపద్యే*
*పద్మే ఽంఘ్రి పద్మే! తవ లోకమాతః!*

*జననీ జగదారాధ్యా*
*జనార్దన కుటుంబినీ*
*పాయా దపాయా దనిశం*
*పయోజ వన వాసినీ ॥*

(కంచిలో శ్రీ రామానుజుల ఇల్లు - కొన్నాళ్లకు)

రామానుజులు : ఏమిటీ సందడీ?

తంజ : ఏ ముందీ? సాపాటుకు వచ్చిన అతగా డెవరు?

రామానుజులు : కాంచీ పూర్ణుడు.

తంజ : అ దేమో! తిరుక్కచ్చి నంబి కాదూ? బ్రాహ్మడేనా?

రామానుజులు : భాగవతుడు.

తంజ : ఇదో కొత్త కులం లాగ ఉందే.

రామానుజులు : ఆ. అలాంటిదే.

తంజ : 'భాగవుతు లనీ, ప్రపన్ను లనీ నానా గోత్రీకుల్నీ సాపాటు కని పిలవడం, ఇల్లు కడగలేక నేను చెడడమూను. కంచిలో ఉన్న గోమయం అంతా ఇక్కడ తగలేసినా పరిశుభ్రం కాదు. ఊరూ వాడా తగలడుతుందని కాని రవ్వంత అగ్నిహోత్రం అంటిద్దామనుకున్నా నీ ఇంటికి.

రామానుజులు : చా లింక. ఆగు! ఇది మూడో అపచారం.

తంజ : ఆఁ. అపచారమే! మొదటిది దాని కెవతికో తిండి పెట్టకపోవడం. ఇంకో టేమిటండీ?

రామానుజులు : మొన్న బావి దగ్గిరకి నీళ్లకు పోయావు కాదూ?

తంజ : అవును. మీ గురువుగారి భార్య కూడా అక్కడ సిద్ధమయింది. ఏం? విస్సాటం ఆవిడగారికి! రివ్వున చేతులూపుకుంటూ నీళ్ల తోడేసరికి నాలుగు చుక్క లెగిరి నా బిందెలో పడ్డాయి. ఆవిణ్ణేం తిట్టానా? కొట్టానా? నా బిందెలో నీళ్లు నే నొలక పోసు కున్నాను. మళ్లీ చచ్చినట్లు తోడుకున్నాను. ఆవిడగారి కెంత కోపం వచ్చిందీ? నీ గురువుగారి భార్యనని తెలియదా అంది. గురువుగారి భార్య అయితే ఆచారాలూ చట్టుబండలూ లేవూ?

రామానుజులు : చాలులే! ఇక నీతోవ నీది, నాతోవ నాది. పాపం ఏ మనగలను? వరదదాసు నిచ్చి పంపుతాను. నీ తండ్రి ఇంట నాల్గునా ళ్లుండి రా.!

తంజ : (ఏడుస్తూ) అలాగే పోతాను మీకంత బరువైతే. నలుగురూ ఎవరిది తప్పంటారో చూద్దాం.

రామానుజులు : సరే. నేనూ కోవెలకి పోవాలి.

# మూడో రంగం

[కాంచీపురం. ఉదయం. వరదరాజస్వామి ఆలయం]

కాంచీపూర్ణుడు : మహాపూర్ణా! నీకు తెలియని దేమున్నదయ్యా! ఇది వరకు ఆళవందారులు రెండుసార్లు ఈ కంచికి విజయం చేశారు. రామానుజుని దౌదౌలనుంచి చూడడమే కాని 'రావయ్యా నాతో కంచికి' అన్నారు కారు. ఇప్పు డాళవందారులు అవతారం చాలించే సమయంలో వచ్చావు.

మహాపూర్ణుడు : కాంచీపూర్ణా, మన ఆచార్య ప్రభువులకు తెలియని దేముంది? త్వరగా కంచికి పొమ్మన్నారు. నిన్ను కలుసుకొమ్మన్నారు. నీతో రామానుజుని దర్శించ మన్నారు. అతన్ని సమీపించగానే తాము రచించిన స్తోత్రం పఠించ మన్నారు. తప్పదు. రామానుజులు భాగవత మత స్థాపన కోసం అవతరించిన ఆదిశేషులే అన్నారు. అయితే కాంచీపూర్ణా! అక్కడ ఆళవం దారు లే స్థితిలో ఉన్నారో అని మనస్సు ఊరికే చెదిరిపోతూ ఉంది. రామానుజుడీ దారినే వస్తాడా?

కాంచీపూర్ణుడు : ఆ:! వచ్చే వేళయింది. ఈ వరకే శాలకూపం నుండి తిరుమజ్జనం కోసం నీరు తెస్తూంటాడు. ఆహా! నాహృదయం లాగే ఈ తిరువీథీ, ఈ మండపం, ఈ గోపురం, ఈ గంటలు, ఈ ప్రపన్నులు రామానుజుని అడుగు సవ్వడి కోసం ఊపిరి బిగబట్టి చూస్తూంటారు. తెలుసునా? అడుగో మహాపూర్ణా! అడుగో!

అడుగో ఆతడె క్షీరసాగర సముద్యత్ఫేన
  సంకాశముల్ మడుగుల్ దాల్చి, మృణాల తంతు
నిభ శుంభ ద్బ్రహ్మసూత్రంబు లే
  ర్పడ, ఆత్మోచిత వేషభాషలను వొప్పున్,
నమ్రుడై దారి లో

యెడుల భక్తావళి కెట్టు లొత్తి గిలునో,
యెట్లాదలన్ వంచునో!

మహాపూర్ణుడు : ఔరా! బాలార్క బింబింలా ప్రకాశిస్తూ కూడా ఎంత శాంతంగా, సుందరంగా చల్లగా ఉంది ఈతని మూర్తి! ఎదురుగా పోనా కాంచీపూర్ణా?

కాంచీపూర్ణుడు : వద్దు వద్దు. ఆలయంలోనికి పోనీ! అర్చన కానిచ్చి రానీ!

మహాపూర్ణుడు : నే నంతవరకూ ఇతనికి దూరంగా ఉండలేను. ఆళవందారుల ఆజ్ఞ కూడా నన్ను స్తిమితంగా ఉండనీయడం లేదు. కాంచీపూర్ణా! మనమూ దేవళం లోకి పోయి దూరాన నిలిచి వరదయ్యను ఈ అయ్య ఎట్లు కీర్తిస్తాడో విందాం. నడు నడు. అదుగో అది క్షీరసాగర ఘోషలాగో, పాంచజన్య ధ్వని లాగో ఉంది ఆ కంఠస్వరం.

[రామానుజుల గొంతు అంతకంతకు దగ్గరగా వినబడుతుంది]

రామానుజులు : శ్రీమన్మహోన్నత రత్నచ్ఛటోదారకోటీర కోటీ రవి జ్యోతిరాటీకనోద్దీవ వశ్యుద్ధన ధ్వాంత విభ్రాంతి కృత్యుంతలా - అత్యంత కాంతాళి కాంతాభి రామాననా, ఇందిరా మాన సాధీన నానా జగద్వల్లభా, గల్ల భాన్వన్మణీ మండలాఖండ లా లిత్య భాకుండలా, కుండలీశాన తల్పా, ఉరఃస్థాయి తల్పా, సదా నిర్వికల్పా, కనత్కౌస్తుభాకల్పకా, సత్యసంకల్పకా, భక్త బృందాలయాళింద కల్పా, అనల్పానుకంపా మతీ!

[ఆలయం గంటలు, సన్నాయి, రవంత గట్టిగా మోగాలి]

మహాపూర్ణుడు : ఆహా! వరద రాజ ప్రభువులు కన్ను లరవిచ్చినట్లూ, శిరస్సు రవంత వంచి ఆలకిస్తున్నట్లూ అనిపిస్తున్నది.

ఆహా! నేనిప్పుడు తాయారు శ్రీ పెరుందేవిని కీర్తిస్తాను. రామానుజయ్యను శ్రీరంగానికి అనుగ్రహించమని.

*శ్రీ మన్మహాభోగ రమ్యోర్ధ్వభాగస్ఫురత్కౌస్తుభాఖ్యాక*

*రత్న ప్రభా పాలికా శృంఖల ప్రోల్లసల్లాంఛనోద్వేల*

*జిహ్మాప లానీక సత్సీరికా విష్ణు వక్షస్థలీ కేలికాడోలికా*

*ఖేలనా లోలశీలే! నమల్లోకపాలే, విశేషాదరానమ్ర*

*భాషాదికాశేష గీర్వాణ యోషామణీ నీలశోభాస్పదా*

*రాళ దీర్ఘాలకానీక దీప్తిచ్ఛటా భంగభృంగావళీ*

*సంగ రంగత్పదాబ్జే! సముద్యన్ముఖాబ్జే ........*

[ఆలయం గంటలు, సన్నాయి రవంత గట్టిగా మోగ్రాలి. అరచిటిక నిశ్శబ్దం. సన్నాయి గంటలు దూరమౌతాయి. దేవళం వెలుపల అడుగుల చప్పుడు]

రామానుజులు : ఓహో! అమ్మ వారి నెంత మనోహరంగా కీర్తించాడు. ఆ సాహిత్యం లక్ష్మీదేవి కల్యాణ గుణాలను కీర్తిస్తున్నట్లే ఉంది గాని. ఆ కంఠరవంలో మాత్రం అవసరంగా దేనినో అర్థిస్తున్నట్లు ఉన్నది. ఇదిగో ఆ భాగవతులు మన కాంచీపూర్ణుడితో ఇక్కడ వేంచేసి ఉన్నారు. వీరి దర్శనం చేసుకుంటాను. అయ్యా! తమ తిరువడిఘళ్ ఆశ్రయిస్తున్నాను. తమ రెవరో ఏ గ్రామం నుండి విజయం చేశారో చెబుతారా?

కాంచీపూర్ణుడు : అయ్యా, వీరు శ్రీ యామునాచార్యుల వారి శిష్యులు.

మహాపూర్ణుడు : ఆళవందారుల అంఘ్రి రేణువను!

రామానుజులు : దాసానుదాసుడను!

కాంచీపూర్ణుడు : అయ్యా! రామానుజా! ఆళనందారులు వీరిని నీకోసమే పంపారు.

రామానుజులు : ఎంత ధన్యుణ్ణి! వారి ఆజ్ఞ ఏదో సెలవిస్తారా?

మహాపూర్ణుడు : నిన్ను శ్రీరంగానికి తీసుకుని రమ్మని –

రామానుజులు : అయ్యా! నేను ఈ కాంచీపూర్ణులవంటి పరమ భాగవతుల్ని సేవించుకుంటూ, తాయారునూ, వరదయ్యనూ దర్శించుకుంటూ ఈ కంచిలో కాలక్షేపం చేసుకుంటున్నాను. వరదయ్య నన్ను కంటికి రెప్పలాగ కాపాడుతున్న దైవం. ఇన్నాళ్ల నుంచీ ఈ వేగవతి నా కాలుష్యాన్ని కడుగుతూ ఉంది. ఇది నాపాలి వైకుంఠం!

మహాపూర్ణుడు : అవునలాగే! అయితే శ్రీరంగం భూలోకవైకుంఠం. అక్కడ శ్రీమన్మహావిష్ణువులు శేషాహిపై విజయం చేసి ఉన్నారు. అయ్యా, రామానుజా! నీవు భాగవత మతస్థాపనకై భూలోకాని కవతరించిన ఆ ఆదిశేషమూర్తివే అని ఆచార్య ప్రభువులు సెలవిస్తున్నారు. నీ వల్ల సత్య మత స్థాపనం కావలసి ఉంది. ఆళవందారు అంత్యశయ్యపై ఒరిగి ఉన్నారు. నీతో సెలవియ్యవలసిన వేవో ఉన్నవి. వారి మనస్సు చాలా తొందరపడుతూంది. తొందరగా రా. ఆలస్యం చెయ్యకు. వెంటనే!

కాంచీపూర్ణుడు : ఆళవందారుల ఆజ్ఞ భగవదాజ్ఞ వలె శిరోధార్యం. రామానుజా! కదలవయ్యా, కంచి నుంచి శ్రీరంగానికి.

మహాపూర్ణుడు : అన్న, విన్నావ రామానుజా! మన యాము

*నాచార్యు లిడిన యానతి గదయ్య!*
*నీరాకకై సారె సారె కారయును, చూ*
*పుల దేశికులు ప్రాణములను నిలిపి*
*భూలోక వైకుంఠము గదయ్య మన అయ్య*
*రంగయ్య విడియు శ్రీరంగ నగరి*

లావణ్య శేవధి రంగయ్య కారుణ్య
　నీరధి రంగయ్య నిన్ను నన్ను
సాకనే గద అట నిరజా తటమున
వీడు వీడి ఈ నాడు కావేరి తీర
మందు కొలువుండు దేవి తాయారు తోడ
ప్రేమ రసపూర్తి శ్రీరంగధామ మూర్తి!

స్వాభావి కానవధి కాతిశయేశిత్రృత్వం
నారాయణ త్వయి నమ్నృష్యతి వైదికః కః?
బ్రహ్మా శివ శ్శతమఖః పరమస్వరా డి
త్యేతేపి యస్య మహిమ్నార్ణవ విప్రుషస్తే

రామానుజులు : ఓహో! ఎవరు రచించారు ఈ దివ్యశ్లోకాన్ని?

మహాపూర్ణుడు : శ్రీ యామునాచార్యులు.

రామానుజులు : అయ్యా, వారిని దర్శించే భాగ్యం నాకు కలుగుతుందా?

మహాపూర్ణుడు : సులభంగా. అందుకే కదయ్యా నిన్ను శ్రీరంగానికి రమ్మంటున్నాను.

రామానుజులు : నడవండి – ఇల్లాగే వస్తున్నాను. ఒక్కసారి వరదరాజ ప్రభువుల వద్ద సెలవు తీసుకుంటాను. తండ్రి సెలవియ్యవద్దా చెప్పండి పోయే లోగా శ్రీ తాయారు పాదాలను కళ్ల కద్దుకోవద్దా, చెప్పండి? వస్తున్నా.

స్వామి! ఓ వరదరాజా! ఒక్క సారి సెలవీ
　రమ్మని తల యూపరాదో తండ్రీ!
ఓ పెరుందేవమ్మ! ఊఁ యనేరాదొకెం
　బెదవుల వెన్నెలల్ పొదివి తల్లి!
ఏ మందువో ఆన తీగదయ్యా యథో
　త్కారి ఆశ్రిత జనతాపహారి
వేగవతీ సుధావీచి ఎన్నడు విందు

నే ఎలుగెత్తి నాకిమ్ము సెలవు

శిరసుపై ధరియించి దేశికుల యాన
పోవలయు గాదె శ్రీరంగపురికి సెలవు!
భాగవతులార సెలవు ప్రపన్నులార!
కరిగిరీ! సెలవో కాంచికా పురమ్మ!

కాంచీపూర్ణా, సెలవు! నడవండి స్వామీ!

[ శ్రీ రంగానికి పోయే మార్గం జనం కలకలం మాటల్ని ముంచెయ్య కూడదు]

ఇద్దరు : ఏదయ్యా, వైకుంఠం?

మరిద్దరు : శ్రీరంగం, శ్రీరంగం!

అన్ని గొంతులు : భూలోక వైకుంఠం
శ్రీరంగం శ్రీరంగం

మహాపూర్ణుడు గొంతులు : అన్న! విన్నావ రామానుజా! కావేరి
పాటతో పాటియే ఆ ప్రపన్నుల మాట
ఈ దరిద్ర వచస్సు లెట్లు వర్ణించునో
యీ రంగశాయి కొల్వున్న వైకుంఠమ్ము!

రామానుజులు : నడవండి మహాపూర్ణా, తొందరగా. మనమూ
పాడదామా కలిసి వీరితో?

రెండుగొంతులు : ఎవరయ్యా మన దైవం

మరి రెండు : రంగయ్యా రంగయ్యా

అన్ని గొంతులూ : కావేరి రంగయ్యా
కస్తూరీ రంగయ్యా

మహాపూర్ణుడు : ఆ వంక శ్రీదేవి, ఈ వంక భూదేవి
నలువంక పర్యంక పాళిగా శేషాహి
శ్రీ సుదర్శన పాంచజన్య కౌమోదకీ
శ్రీ వత్స కౌస్తుభమ్ములతో రమాజాని.

రామానుజులు : ఆహా – మహాపూర్ణా! నేను శ్రీరంగానికి పోతున్నట్లు లేదు. శ్రీరంగమే శేషశాయితో నాకెదురైనట్లుంది. అదిగో తిరువరంగాన్ని ప్రత్యక్షం చేస్తున్నారీ భాగవతులు!

రెండు గొంతులు: ఏ ఊరూ ఏ వారూ

మరి రెండు గొం.: ఏ సీమా పోతారు?

అన్ని గొంతులు : శ్రీరంగం పోతామూ
శ్రీ చరణా దాసులమూ
అడియేనూ దాసులమూ
దాసానూ దాసులమూ

మహాపూర్ణుడు : తిరువరంగములోన దినదినము తిరునాళ్లు!
తిరువరంగములోన నరులెల్ల తిరుముళ్లు
ఏడు ప్రాకారాల వీడెల్ల తిరుమాళి
గలను వనమాలి మంగళ గాథలే మ్రోగు!

రామానుజులు : అయ్యయ్యో, ఈ ప్రపన్నుల సావాసం వదల లేకున్నాను, గాని ఈ వరకే రెక్కలు తొడుగు కొని శ్రీరంగం పోవలసిన వాణ్ణే కదా! అయ్యయ్యో!

రెండు గొంతులు: కావేరీ కెరటాలా
కలకలమూ అదిగదిగో!

మరి రెండు గొం.: కోవెలపై బంగారూ
గోపురమూ అదిగదిగో

అన్ని గొంతులూ: కోవెలలో రంగయ్యా
కొలువుండే నది గదిగో

మహాపూర్ణుడు : తొలిప్రొద్దు బంగారు తలపాగ చుట్టగా
మలునందె మాణిక్య మకుటమ్ము పెట్టగా
ధగధగా ధగధగా దొడాల నదె యదే
రంగపుర గోపురోత్తుంగ తర శిఖరాళి
గొంతెత్తి పిలుచు వేగుంబోక కావేరి
తరగలై కరుగు పుష్కరిణీ శిశిర వారి!
లాలించి లేపు కేలం దట్టు వలిగాలి!
ఉలికిపడి లేచు కోవెల తోట వలిగాలి

రామానుజులు : రంగవిమానం మీద సుదర్శనాన్ని దర్శించే ఈ ప్రపన్నులు ఎలాగ పరవశులై ధూళిలో సాగిలపడుతున్నారో! వీరి దేహా లంటిన ఈ మంటిని తిరుమణి లాగ నా నొసటను అద్దుకుంటాను. మహాపూర్ణా! తీరా రంగపురి సమీపించాక ఇంత ఆనందంలో కొంత కలత నా మనస్సును బాధ పెడుతూంది. ఆచార్యులెలా ఉన్నారో! అయ్యా, నడు. ఆపురప్రాంతాన ఆ జనం ఏమిటి? ఆ కలకలం ఏమిటి?

మహాపూర్ణుడు : నడు, రామానుజా! తొందరగా. అబ్బా! అది కావేరి ఒడ్డున శ్మశానం. అమ్మయ్యో ఆళవందారు లెలాగ ఉన్నారో? నా హృదయాన్ని పట్టుకో లేక పోతున్నాను. అయ్యయ్యో! ఆళవందారు లెలా ఉన్నారో? అడుగో అతడు వరరంగయ్య లాగ కనపడుతున్నాడు. కలవరపడుతూ కంచివైపు ఎదురు తెన్నులు చూస్తున్నాడు. అవును రంగయ్యే! రామానుజా, అయిపోయింది!

రామానుజులు : [దుఃఖంతో] నేను క్షమార్హుణ్ణి కాను. నేను భాగ్యశాలిని కాను. ఎంత ఆలస్యం చేశాను. ఆచార్య దేవులు నేను రాగానే కళ్లు తెరిపార విప్పి – నన్ను చల్లగా

చూస్తారనీ, చిరునవ్వు నవ్వుతారనీ, అంత దూరాల నుండగానే చేతులు నావైపు చాపుతారనీ, నేను వారి పాదాలమీద పడిపోతాననీ ఎంత అను కున్నాను!

మహాపూర్ణుడు : [దుఃఖంతో] ఆళవందారులు అవతారం చాలించి కూడా నీ కేదో ఆదేశం అనుగ్రహించి ఉంటారు. వర రంగా వర రంగా ఎప్పుడయ్యా వర రంగా!

వర రంగడు : ఉదయాన రంగగోపురంమీద తొలి సూర్య కిరణం వాలబోతుంటే... రామానుజులా అడియేన్ దాసోహం!

రామానుజులు : అడియేన్ దాసోహం.

వర రంగడు : ఈ వింత విన్నావా మహాపూర్ణా! మరణశయ్యా గతులైన ఆచార్య ప్రభువుల సంగతి ? వారి కుడిచేతి మూడు వేళ్లు ముడుచుకొని ఉన్నాయి, తెలుసునా?

రామానుజులు : ఆఁ ఆఁ వారు నా కాదేశించినవి మూడు కార్యా లున్నా యన్నమాట. నడవండి. ఆళవందారులు అస్తమించారంటారే, వారు మరణించడ మేమిటి? నడవండి తొందరగా.

వర రంగడు : ఇదుగో తప్పుకుంటున్నారు. తలలు వంచుకొని ఈ శిష్యులూ, ప్రపన్నులూ!

రామానుజులు : (దుఃఖంతో) ఆచార్య ప్రభూ! రామానుజుడు వీడు. నీ పాదాలు కళ్లకద్దుకుంటున్నాడు. తమ సెల వేమిటి? నేను వచ్చాను. నేను వచ్చాను ప్రభూ! (అందరూ దుఃఖిస్తారు) అయ్యా, విన్నారా? ఆచార్యు లేదో సెలవిస్తున్నట్లున్నారు! నే నాముఖానికి దగ్గరగా చెవి పెట్టుకుని వింటాను ఆఁ. తెలిసింది ప్రభూ! నేనలాగే చేస్తాను. తమ సెలవైతే, రంగేశ్వరుల అనుగ్రహం ఉంటే – బ్రహ్మ

సూత్రాలకు భాష్యం వ్రాస్తాను.

జనం : అరే! ఆహా! ఓహో! ముడిచిన వ్రేలు ఒకటి ఎలా తెరుచుకుందో!

రామానుజులు : చిత్తం ప్రభూ, సహస్రనామానికి వ్యాఖ్యానం విరచిస్తా!

జనం : అయ్యో, రెండో వేలు కూడా .... చూశారా!

రామానుజులు : శ్రీ పన్నిద్ద రాళ్వారుల ప్రభువులు పాయించిన దివ్య ప్రబంధానికి కూడా! ఆచార్య ప్రభూ! ఈ కించిద్జ్ఞునిపై దాసునిపై ఎంత భారం మోపారు! తమ అనుగ్రహం ఉండాలి కాని, సెలవు.

## నాలుగో రంగం

(తరుక్కోట్టి యూర్‌లో గోష్ఠీపూర్ణుని ఇంటివద్ద – గోష్ఠీపూర్ణుడు, మహాపూర్ణుడు)

గోష్ఠీపూర్ణుడు : మహాపూర్ణా! మీరు సెలవిచ్చిన దంతా గ్రహించాను. మొన్న శ్రీరంగానికి వచ్చినప్పుడు రామానుజుల్ని చూశాను.

మహాపూర్ణుడు : అయితే తమ కింకా సందేహమెందుకో తెలియడం లేదు నాకు. దివ్యమైన ఈ ద్వయమంత్రం ఉపదేశించడానికి రామనుజుల కన్న ఉత్తమ శిష్యుడు తమకు దొరకడు.

గోష్ఠీపూర్ణుడు : ఆలోచిస్తున్నాను. మొన్న శ్రీరంగంలో మేం విడిది చేసిన తిరుమాళిగకు రామానుజులు వచ్చాడు. మహా గొప్ప తేజస్వి. తనకా పరమ మంత్రం ప్రసాదించమని పదే పదే ప్రాధేయ పడ్డాడు.

మహాపూర్ణుడు : ఇహ నేం? అంత ఆసక్తీ ఆచార్యుల యెడ అంత భక్తీ లోకోత్తర మైన ఆ ప్రపత్తీ మరెవ్వరికీ లేవు. ఆళవందారులే సెలవిచ్చారు. ఆయన ఆదిశేషువుల అవతార మని. రామానుజుల గుణ గణాలు తలుచుకొన్న కొద్దీ నేను పరవశుణ్ణయి పోతాను స్వామీ!

తనవలె నఖిల భూతముల నాత్మ తలంచు
పరమ కారుణ్య భావమున మించు.
వైకుంఠ సేవానుభవమునను మెలంగు,
అతులిత బుధ విధేయత చెలంగు,
స్మిత పూర్వ మిత సత్యహిత భాషితము లాడు
పరుషోక్తు లెన్నడు పలుకబోడు.
స్వప్నమ్మునందైన పర ధనాదుల గోర,
డపకారులగు వారినైన దూర,
డారి తెరియు వేద శాస్త్రైక గోష్ఠి
గరువ మిసుమంత యైనను కాంచబోడు
అహివరేణ్యుడొ, సైన్య నాయకుడొ గాని
అన్య రామానుజుండు రామానుజుండు

గోష్ఠిపూర్ణుడు : నాకు సంతోషంగానే ఉంది. నే నీదేహాన్ని విడిపోకుండానే ఆ మంత్ర రాజం అతని కందజెయ్యాలి. మారుతిని పంపాను – తీసుకు రమ్మని. దండమూ జన్నిదమూ తప్ప, కూడా మరెవ్వరినీ తీసుకు రాకూడదని కూడా చెప్పమన్నాను.

మహాపూర్ణుడు : ధన్యుణ్ణి. నాకు సెలవు దయచేయండి.

(విరామం. తలుపు చప్పుడు)

మారుతి : అడియేన్ దాసోహం.

గోష్ఠీపూర్ణుడు : ఏం మారుతీ, వచ్చావా?

మారుతి : చిత్తం. శ్రీరంగం అంతా రామానుజులు ఇళైయాళ్వారులనీ, యతిరాజులనీ, ఉడయవరులనీ శతవిధాల పరవశులై కీర్తిస్తున్నారు.

గోష్ఠీపూర్ణుడు : సరే! పోయి వెంటనే రమ్మను.

మారుతి : చిత్తం.

(రామానుజులూ, వాళ్లూ వస్తారు)

రామానుజులు : ఆచార్య ప్రభువుల అంఘ్రిరేణువను.

గోష్ఠీపూర్ణులు : రామానుజా! రా! వీ రెవ్వరూ?

రామానుజులు : నా బహిఃప్రాణాలు కూరేశుడూ, దాశరథీ.

గోష్ఠీపూర్ణుడు : సంతోషం. అయితే రామానుజా, మంత్రోపదేశానికే వచ్చావా?

రామానుజులు : చిత్తం.

గోష్ఠీపూర్ణుడు : దండమూ, జన్నిదమూ తక్క మరెవ్వరూ రాకూడదని మారుతి చెప్పలేదూ? వచ్చిన తోవనే తిరిగిపో.

రామానుజులు : ఆచార్యప్రభువు లనుగ్రహించాలి. తమ ఆనతి మీరగలనా? నాకు కూరేశుడు త్రిదండం, దాశరథి జన్నిదమూను!

గోష్ఠీపూర్ణుడు : (నవ్వు) రామానుజా! నాకు మహదానందం కలిగింది. సరే. వీరిద్దరకూ తప్ప మరెవ్వరికీ ఈ మహామంత్రం ఉపదేశించకు సుమా! రామానుజా, రా లోనికి వెంటనే. ఈ దినం నృసింహస్వామి దివ్యోత్సవం జరుగుతుంది. ఇక్కణ్ణుంచి కోవెలకు పోదాం.

(వాద్య సంగీతం, ఆలయపు కలకలం. జన సందోహం. మంగళ వాద్యాలు వైరిహర రంహో- నరసింహో- రక్షించు స్వామీ)

ఒకడు : ఆగం డాగండి. ఆ రెవరో గోపురం ఎక్కు-తున్నారు.

రెండోవాడు : గోపుర శీర్షం మీద సువర్ణ కిరీటం లాగ మెరిసిపోతున్నాడు.

మూడోవాడు : శ్రీరంగం యతిరాజులు!

ఒకరు : రామానుజు లేమి చెప్పుతున్నారు?

రామానుజులు : ఓం నమో నారాయణాయ
ఓం నమో నారాయణాయ

శ్రీమదష్టాక్షరీ మంత్రము రేబవళ్లు జపింపుడయ్యా
శ్రీమదష్టాక్షరీ మంత్రము శ్రీకరము మోక్షాకరము - ఓం
శ్రీకరుడు శ్రితవత్సలుడు వనమాలియే మన పాలి దైవము
లోకమోహన కరుడే కరుణా లోకుడే మన పాలి దేవము ... ఓం.
సర్వమంగళ గుణాభరణుడు శౌరియే మన పాలి దైవము
సర్వజన చిత్తాపహారి మురారియే మన పాలి దేవము .... ఓం
శ్రీ వికుంఠాలయము విడిచి లోకలోకము లెల్ల కడచి
వెలసెనట దేవేరితో కావేరి తటి మన పాలి దైవము ... ఓం
శ్రీ మనోహర చరణ సేవక చరణమే మన కెపుడు శరణము
చరణమే మస్తకాభరణము
ప్రపన్నులకు ఆపన్నులకు భాగవత సేవయె నిత్యకరణము
సేవయే భవ జలధి తరణము ... ఓం నమో
తలపులోపల తళు కదే మన పలుకులో పరమార్థ మయ్యదె
పనులలోపల పటిమ యదియే భవ్య మష్టాక్షరీ మంత్రము
ఓం నమో నారాయణాయ
(నిశ్శబ్దము)

గోష్ఠీపూర్ణుడు : రామానుజా, ఎంత మహాపరాధం చేశావు? నీ

కొక్కడికే ఉపదేశించిన మంత్రాన్ని గోపురమెక్కి గురువు ఆనతి ధిక్కరిస్తూ పలుగాకులైన నానా ప్రజలకీ ప్రకటిస్తున్నావా? ఈ మహాపచారానికి నీకు కలిగే ఫలితం ఏదో తెలుసుకున్నావా?

రామానుజులు : చిత్తం. భయంకర మైన నరక వాసం.

గోష్ఠీపూర్ణుడు : అయితే కోరి తెచ్చుకుంటున్నావా నరకం?

రామానుజులు : చిత్తం.

స్వామీ, దేవరవారి దివ్యమగు నాజ్ఞన్ మీరి వర్తించుటన్
భూమం బౌ నరకంబు నా కొకనికే ముఖ్యంబుగా చేకురున్
ప్రేమన్ త్వత్పదముల్ భజించి, మనుజుల్ వేలాదిగా నిత్య సౌ
ఖ్యామోద స్థితి కాంచుచుండగనె నా కా నందియం బేవికిన్

తన కష్టంబుల కోర్చియున్ పరుల కత్యంతంబు మేల్గూర్చువా
డనిశంబున్ తన కార్య హాని యయినన్ న్యాయ ప్రచారంబు మా
నని వాడాకలి కుందు వాని కెలమిన్ తా మాని యైనన్ రయం
బున నన్నం బిడువాడు .....

గోష్ఠీపూర్ణుడు : ఆహా! రామానుజా! ఆగు తండ్రీ! నీ అధ్యవసాయానికి మెచ్చాను. నిన్ను నేటి నుంచీ లోకం ఎంబెరుమానారని కీర్తిస్తుందయ్యా. వైష్ణవ మతానికి లోక కల్యాణార్థమై ప్రాచుర్యం ప్రసాదించటానికి నీ కన్నా అర్హులెవరున్నారయ్యా రా! రామానుజా! లక్షలాది ఈ భక్తులూ, ప్రపన్నులూ ఉండగానే ద్వయమంత్రం తిరిగీ అందరం కలిసి పఠిద్దాం!

# మదన సాయకము

## 1

(కొన్ని వందల ఏండ్లకు పూర్వము ఈ కథ జరిగిం దంటారు. విజయ నగరం విజయరామ గజపతుల రోజులలో అని కొందరు, తంజావూరు విజయరాఘవ నాయకుల రోజులలో అని కొందరు. ఎక్కడ జరిగితే నేమి – ఆ దినాలలో మదన దేవునకు తీరిక ఉండేది కాదు. అతడు బాణాలు విసిరినా, యథాశాస్త్రం అవి పూవు బాణాలే! ఇక ఈ కథ విజయరామ గజపతుల విజయనగరంలో వసంత పంచమినాడు మదనోత్సవంతో ప్రారంభమై, వసంత పూర్ణిమనాడు కామ దహనంలో పూర్తి అవుతుంది. మునిమాపు – ఆటపాటలతో జనం కోలాహలం –లేత గాలులమీద తేలి వస్తున్నట్టు దూరాన్నుంచి వినబడుతుంది. అంతకన్న దగ్గరగా దివాణాలలో ఉండే నగారా మోగుతూ ఉంటుంది. ఇంకా దగ్గరగా ఒక మగగొంతు ఈ వైతాళిక గీతం పాడుతుంది. చాలా దూరాన లాగున నగారా మోత వినబడుతూనే ఉంటుంది.)

*విచ్చేయుమో విజయ రామ నృప మౌళీ!*
*విచ్చేయు కామినీ కమల వన హేళీ!*
*మొద లిడిరి నవ్య వాసంత వాసర కేళి!*
*నిలిపిరి దివాణము హజారములో సవారి*

తళుకు పవడంపు కెంపుల పసిడి అడ్డలతో
గిలుకు దంతపు క్లోళ నగిషీ పనులతోడ
తళుకు నిద్దా పచ్చడాల్ సోగ దండెలతో
తెలియంచ గరు లొలయు పరుపు బాలీసుతో,
నిలిపిరి సవారి వెలుపలి హజారములో
విచ్చేయు మో విజయరామ నృపమౌళీ!

మైత్రేయుడు : దయచేయండి మహా ప్రభూ, ఇంత ఆలస్యం అయితే ఎలాగ? మన్మథుని కన్నా మన్మథులు తమకంటే భయం లేదు కాని మా వంటి వాళ్లం ఏం అవాలి? హజారము నుంచి అప్పుడే చావగొడుతున్నాడు మన్మథుడు! ఇక్షుచాపం ఎక్కుపెట్టి, పుంఖాను పుంఖాలుగా పూవు బాణాలు విసురుతున్నాడు. పాపం! వెర్రివాళ్లు. శివాలెత్తి, తాపం చల్లార్చుకుందుకు వసంతాలు చల్లుకుంటున్నారు. అంతఃపురంలో నవ రతీదేవి సన్నిధానంలో కులుకుతూ ఉండే అయ్యగారికి మా కష్టా లేం తెలుస్తాయి? అమ్మయ్యోయ్!

(బాణం దూసుకుపోయినప్పుడు లాగ) అయ్యో! అయ్యో!

విజయరామ గజపతి : (లోపల నుంచి) శహబాష్! మైత్రేయా! నీకూ తగిలిందీ? నీవంటి ముసలి తొక్కను ఏరి ఏరి వేశాడేమిటోయ్ పువ్వుబాణం? ఒళ్లులేని వాడికి కళ్లేం ఉంటాయి? తటాలున విసిరాడు–తాతకు తగిలింది.

మైత్రేయుడు : ఆగండి! మహారాజులుంగారు! మహ మాట్లాడేస్తున్నారు – మన సంగతి తెలియక. అవధరించండి – మనవి చేస్తున్నాను.

విజయరామ గజపతి : ఊఁ.

మైత్రేయుడు : ఈ మహా పట్టణం అంతా గాలించినా విలాసిని వంటి కళానిధి లేదు కదా!

విజయరామ గజపతి : ఇకనేం! విలాసినే?

మైత్రేయుడు : ఆలకించండి. ఆ విలాసిని పెత్తల్లి సింహాచలం లేదూ - దానికి మన మంటే కొంచెం ...

విజయరామ గజపతి : (దగ్గరగా వచ్చి నవ్వుతూ) ఇకనేం? ఈ నాటికి మా మైత్రేయుడు కూడా మగవాడయ్యా డన్నమాట! ఆమెకు నీ మీద అనురాగం అని ఎలా తెలిసింది, మైత్రేయా?

మైత్రేయుడు : ఇందాక మనం వసంతోత్సవానికి దయచేశాం. కేళీ మంటపం దగ్గర విలాసిని మేళం సిద్ధంగా ఉంది. (సంతోషంగా) వెనకాల సింహాచలం విచ్చేసి ఉంది. ఫెడీమని కొంటెముండావాడు దాని మీద మల్లెపువ్వు విసిరాడు. మనమీద నల్లకలువ విసిరాడు. వణికే చేతులెత్తి, కళ్లు తేలవేసి మనకు నమస్కరించింది. చిక్కిం దిరా మనకు సింహాచలం అని తేలిపోలేదూ మరి కళింగ మహారాజా!

విజయరామ గజపతి : కావచ్చులే! కళ్లూ తేలక, కాళ్లూ వడకక అరవై ఏళ్లది ఏం చేస్తుంది?

మైత్రేయుడు : ఆఁ(వెటకారంగా) చిత్తం. ఆమాటలకేమి లెండి మన దగ్గర కట్టిపెట్టండి. మహారాజా! ముప్పై ఏళ్ల ముసలవ్వలూ ఉన్నారు. అరవై ఏళ్ల అందకత్తెలూ ఉన్నారు. సింహాచలం సాక్షాత్తూ భూలోకరంభ మహారాజా, భూలోక రంభ! దయచేయకూడదూ చూపిస్తాం!

విజయరామ గజపతి : నడు మైత్రేయా! మాకూ తొందరగానే ఉంది - సింహాచలం దర్శనం చేయాలని.

(విచ్చేయుమో విజయరామ నృపమౌళీ! అన్న పాట మళ్లీ వినపడుతుంది)

## 2

(అరనిముషం అనుకూల వాద్యగానం. మొదట కొంచెం దూరంగా, తర్వాత దగ్గర దగ్గరగా. కొన్ని గొంతులు కలిసి పాడినట్లు పాట వినబడుతుంది)

*జయ జయా! జయ జయ జయా!.*
*జయ రతీ రమణీ ప్రియా!*
*జయ రమా హరి నందనా!*
*జయ సమీర స్యందనా!*
*జయ నితాం తాశాలతా నందన వనా!*
*ప్రణ యావనా!*
*జయ జయా జయ జయ జయా!*

*గంధవహ మద సింధురా!*
*కామరాజ్య ధురంధరా!*
*బంధు జీవక పాటలీ మం*
*దార బంధుర మందిరా!*
*జయ జయా, జయ జయ జయా*

*అరుణ పల్లవ కేతనా!*
*తరుణ హృదయ నికేతనా!*
*జయ రసాల శరాసనా !శుకవాహనా!*
*నవ మోహనా! జయ*
*మధు సఖా, జయ జయ జయా!*
*మల్లికా విశిఖా జయ !*
*జయ వసంత వన ప్రియాళీ*
*వందిమాగధ గీతికా!*
*జయ జయా! జయ జయ జయా!*

విజయరామ గజపతి : ఆహా! ఎవరు మైత్రేయా! ఎంత బాగా చెక్కాడు! ఎవరా శిల్పి? మన్మథ మహా ప్రభువుల ఈ మూర్తి చెక్కినవారు?

మైత్రేయుడు : వీరభద్రాచార్యులే! మన ఆస్థాన శిల్పి.

విజయరామ గజపతి : ఈ గీతం ఎవరు రచించారో?

మైత్రేయుడు : ఇదుగో ఈ ఉత్సవంలో ఈ పట్టణంలో ఎవరు ఏ గీతం పాడినా విలాసిని రచించిందే అనుకోండి. మనమూ కొన్ని రాశాము లేండి. కొన్ని వసంతుడి గాడికి నేర్పా. అవీ వింటారు తమరు. ఇటు దయచేయండి.

విజయరామ గజపతి : వహ్వా! వసంతాలు చల్లుకుంటూ భగవానుని ఎల్లా కొలుస్తున్నారో ఈ స్త్రీలు!

(స్త్రీల పాట)

*జోహారూ జోహారో!*
*హరి నందనునకు జోహారో!*
*ఆమని సఖునకు జోహారో!*
*అలరు రతీసతి కౌగిలిలో పులకించు*
*సామికి జోహారో! జోహారో జోహారో!*
*చెరకు విలుతునకు జోహారో*
*చిలుక వజీరుకు జోహారో*
*చిరు విరి తూపుల వలపులు రేపే*
*చిలిపి జోదుకే జోహారో!*

విజయరామ గజపతి : ఇది నీగీతం కాదు, స్పష్టం. నీ తెలివి తేటలు మన మెరగనివా? సామాన్యమైనవా?

మైత్రేయుడు : మరే, అదే కాదూ మహాప్రభూ!! గ్రహించారూ తమరు కూడా! గొప్ప బుద్ధి జాతి! ఇటు దయచేయండి. మనల్ని చూసి వసంతుడు గాడు మన పాటే ప్రారంభించాడు.

వసంతుడు : (రాజు నౌఖరు పాడుతుంటే వాని బృందం నేర్చుకుంటుంది భజన లాగ)

దయలేదా నామీదా తలిరూకైదువు జోదా!
ఒక మల్లీ పువ్వైనా ఒక నల్లా కలువైనా
చికిలీ చేసి, కాస్త సెక తగిలించీ, నాపై
పినరో కొనరో మీద, విసరగ రాదా వాదా?
దయ లేదా నామీద!

చక్కని చుక్కే కాదు, టక్కుల ప్రోడే కాదు
ముక్కాలీ ముసలి దైనా మక్కువ నను చూడబోదు!
వలపే చేదు, మరుని పిలుపే రాదూ!
దయ లేదా నా మీదా!

జోడు మొనల పువు లేసీ, జోడు జోడు విడదీసీ,
తోడు నీడవై యుందువు తుంటరి విలుకాడా!
నేనొక్కడ నేలా చెప్పా
అక్కట నాదా తప్పా
దయలేదా నామీదా!

విజయరామ గజపతి : భేష్! మైత్రేయా! జోరైన పాట రాశావు. ఇది సింహాచల దర్శనానికి పూర్వం రాసిందా?

మైత్రేయుడు : మరే, అదిగో సింహాచలం! కేళీ మండపం దగ్గర కొచ్చాము. ఆఁ ఆఁ వీళ్లసాధ్యులు మహారాజా! ఓర చూపులతో ఎప్పుడు మన్ని చూశారో అంతలో పాట ఫిరాయించి వేశారు.

(మహా ప్రభువులు, మహారాజులుంగారు, అంటూ రకరకాల ఆడ మగ గొంతుల్లో మాటలు వినపడతాయి. ఒక్క చిటిక నిశ్శబ్దం)

మైత్రేయుడు : ఆఁ. ఇహ మొదలుపెట్టవచ్చు.

విలాసిని : (కొంచెం కూనిరాగం తీసి పూర్వకాలపు మేళంలో లాగ)

"కలలోనొక్క త్రిలోకసుందర శుభాకారుండు,
మాణిక్య కుం
డలి శోభాంచిత మందహాస రసవత్ సుస్నిగ్ధ
గల్లద్వయీ
లలితాస్యుండు సుగంధ బంధుర సుమాలంకార
నీలోత్పలో
జ్జ్వల ధమ్మిల్లుడు, కామినీ హృదయ
పాంచాలుండు లీలాగతిన్ *

(మేళంలో లాగ గజ్జెల చప్పుడు)

వినవే నిన్నటి రేయీ కనుమూసి పవళింప
కలలోన కనుపించెనే –ఓ చెలియా! ఆ
వలరాజునే మించెనే!
కనుల కన్నుల కలిపెనే, తెలి
కలికి నగవుల పరపెనే
అనుగు కోరిక రేపెనే, నా మనను
తా నూయాల లూపెనే – వినవే ....
కదలీ చెంతకు వచ్చీ, కరగీ అందమూ మెచ్చీ
చెవిలో బాస లాడెనే – ఓ చెలియా! నన్
తవిలి ఏదో వేడెనే!
పెదవి పెదవుల కూర్చెనే – నన్నదిమి కౌగిట
చేర్చెనే
కదలి శయ్యకు తార్చెనే – నా హృదయ
మిది ఎటు లోర్చెనే చెలీ ! .... వినవే .....

---

* కనుపర్తి అబ్బయామాత్యుని అనిరుద్ధ చరిత్రం

# 3

(శ్రీ విజయ రామ గజపతుల ఏకాంత మందిరంలో మహారాజూ, మైత్రేయుడూ)

మైత్రేయుడు : ఇది మంచిది కాదంటాను. ఇదీ ... మంచిది కాదంటాను మహాప్రభూ!

విజయరామ గజపతి : ఏది?

మైత్రేయుడు : ఈ పరధ్యానం. ఇటువంటి ధోరణి తమ కిదివరకు ఎన్నడూ లేదు. మార్పులూ, మమతలూ కనిపెట్టడంలో మహారాణీవారు మహా అసాధ్యురాలు. పరధ్యానాలను ఇట్టే పసికట్టుతారు. అయినా ఎందుకు చెప్పండి మహాప్రభూ! మహారాణీ వారి వంటి సుందరులు భూలోకంలో లేరని ప్రసిద్ధి. నన్ను చూడండి. మంచి నిగ్రహం – బహు కట్టుదిట్టంగా నడిపిస్తాను జీవితం.

విజయరామ గజపతి : అఘోరించావులే! నీ సింహాచలం సంగతి అప్పుడే మరిచిపోతామా ... విలాసిని మంచి విదుషీ మణిలా కనబడుతూంది.

మైత్రేయుడు : బాగా సెలవిచ్చారు. సరి, నెమ్మదిగా అంటారే? మంచి విదుషీమణి అని! గౌరీపతి శాస్త్రుల వద్ద కావ్య నాట కాలంకారాలు అభ్యసించింది. పాపయ్య శాస్త్రుల వద్ద సంగీతమూ, భరతశాస్త్రమూ! ఆ పద్యం చదవడం, వెంటనే ఆ పాట యెత్తడం – ఆ పాట ఆశువుగా చెప్పిందే మహాప్రభూ! ఆ ఆంగికాభినయ చమత్కృతీ, ఆ వాచికాభినయ విలాసమూ ఆ నృత్త నృత్య కరణాంగ హారాల కౌశలమూ – ఓహోహో! సాక్షాత్తూ ఊర్వశి. ఊరికే

నవమన్మథుల మనస్సు ఊగిపోతుందా! వెధవ పువ్వు బాణాలు, వెధవ పువ్వు బాణాలా అని! వేశా డెల్లాగైతే నేం!

విజయరామ గజపతి : ఊరుకో మైత్రేయా! నీ తెలివికి సంతోషించాము. నీ వనుకున్నట్లు (నవ్వుతూ) మాలో మదన తాప మేమీ రేగలేదు. ఆమె కళా వైదగ్ధ్యానికి మేం ముగ్ధుల మయ్యాము. అంతే!

మైత్రేయుడు : చిత్తం చిత్తం! తెలుస్తూనే ఉంది.

విజయరామ గజపతి : మైత్రేయా!

మైత్రేయుడు : ఏం సెలవు? వెళ్లిరానా విలాసిని ఇంటికి?

విజయరామ గజపతి : ఆc. మే మీరాత్రికి అక్కడకు వస్తున్నామని చెప్పు.

మైత్రేయుడు : చిత్తం! మనకు మగ తాపికత్తె మహోద్యోగం రాసి ఉన్నప్పుడూ!

(ఇద్దరూ నవ్వుతారు)

# 4

(అంతఃపురం మోసాల - రదనిక ప్రవేశం)

రదనిక : (పాటలాగ)

వచ్చినాడే మా వసంతుడు
పచ్చతీగా కుచ్చు పాగాతో

వసంతుడు : (ప్రవేశించి) నామీదే! ఈ పాట నామీదే! నిన్ననే అనుకున్నాను - నా తండ్రీ,మన్మథ దేవా! రదనికను పువ్వుతో కాదు, బడితెతో బాది ఊరుకున్నావని!

(పాటలాగ కొంచం నత్తితో అభినయిస్తూ)

మన్ని చూసి మరిగి కరిగి పోయిందీ
నన్న నన్నగ పిల్లి కన్ను కొట్టిందీ!

మహాప్రభూ! మదన దేవా! ఆపద్బాంధవా! అందుకో వయ్యా దాసుని దండాలు.

రదనిక : అఘోరించావులే కోతి ముండా కొడకా! .... నీకు కుచ్చు పాగా ఏదిరా బాదం కాయలా బుర్ర కనబడుతూ నువ్వూ! ఇలా చూడు. మహా ప్రభువులు విజయం చేస్తున్నారా? అమ్మగారు కనిపెట్టుకుని ఉన్నారు.

వసంతుడు : మహారాజులుంగారు మందిరంలో లేరు.

రదనిక : ఏడ్చినట్టే ఉంది. ముందే చెప్పకూడదూ ఈ మాట?

వసంతుడు : మ ... మ ... మనస్సు కడ్డంగా .... మ ... మ .... మదన సాయకాలు తెరలు తెరలుగా ఉన్నాయి రదనికా! ఇదిగో రదనికా! ఆ బుగ్గమీద – ఊరికే – అంతే! ఈ వేలితో – అంతే మనం తొందర పడే వాళ్లం కాము. ఊరికే చెక్కిలి మీద వేలితో నొక్కడం, వెనక్కి తిరిగి తుర్రుమనడం! నువ్వు కళ్లు మూసుకో! ఆఁ వస్తున్నా .... దగ్గరగా వస్తున్నా ... ఇదిగో వస్తున్నా! ఎవరో చెప్పుకో!

(లోపలి నుంచి మహారాణీ గొంతుక 'రదనికా'! అని)

రదనిక : అమ్మా!

రాణీ : ప్రభువులు విజయం చేస్తున్నారా?

రదనిక : మందిరంలో లేరని వసంతుడు చెప్తున్నాడు.

రాణి : అదేమే రదనికా! అంత ఆలస్యం అయింది. పూజా సమయం దాటిపోవడం లేదటే?

రదనిక : ఈ నాటికి మదన దేవుల అపరంజి మూర్తిని పెట్టి అర్చించండమ్మా!

రాణి : నా కెందుకే అంత కర్మం! మన్మథ మన్మథులు మహారాజులుంగారే ఉంటే! (కొంచెం ఆగి) రదనికా! నాలుగు దినాలనుంచీ వారిలో ఏదో మార్పు కనపడుతూ ఉంది. ఆహార విహారాలలో ఆసక్తి లేకపోవడం, అవసరం లేని తొందరా, అంతకన్న జాగూ–నా మనస్సు మనస్సులో లేదు రదనికా! (నిట్టూరుస్తుంది)

రదనిక : అమ్మా! వారు రాచకార్యపు తొందరలో మునిగి ఉంటారు.

రాణి : ఊఁహూఁ కాదే! వసంత పంచమి నాటి నుంచీ వాలకమే మారింది. పోవే! వారు రాగానే ఇటు విజయం చేయమని మనవి చెయ్యి.

రదనిక : చిత్తం!

రాణి : ఆ తూర్పువైపు గవాక్షం తెరు. ఈ ముఖమల్ దిండుపైన మా వీణ పెట్టి వెళ్లిపో (వీణ వాయిస్తూ)

*వెన్నెలలు చలియించునే చెలియ!*
*వేగి ఉసు రుస్సు రనునే*
*రా డాయె నా స్వామి*

*పా డాయె నామనసు*
*విరహ వీణా తంత్రి*
*కరగి కంఠము విప్పదే!*
*వెన్నెలలు చలియించునే చెలియ!*

వేగి ఉసు రుస్సు రసునే
పొగడ పూవుల పుంతలో తడసెనో
మొగలి గుబురుల దారిలో విడిసెనో
ఆలసించిన చెదరి అసువులే నిలువవే
ఏమి చేతునె నెచ్చెలీ!
వెన్నెలలు చలియించునే!

# 5

(విలాసిని మందిరంలో క్షేత్రయ్యపదం ఒకటి రెండు చరణాలు వినపడతాయి. ఇంకో గదిలో నుంచి ఎవరో పాడుతూ ఉంటే వినపడినట్లు)

విలాసిని : ఏమే రూపా!

రూప : ఏమమ్మా, అక్కా!

విలాసిని : ఎవరే ఆ పదం పాడుతున్నా రిప్పుడు! అబ్బా! ఊరుకో మన గూడదూ? అగ్నిహోత్రునికి వాయుదేవుడు తోడైనట్లు ఇప్పు డెందుకే నన్ను వేధించడానికి? ఊరుకో మనవే! అయ్యో ఇదేమే? ఈ పరుపు మీద పువ్వులు నువ్వేనే పరిచావు? చాల్లే, తీసెయ్యి. ఈ కిటికీ తెరు. చెల్లీ! ఆ కుంచెలూ, రంగులూ ఇలా తే! ఆ చిత్రం పూర్తి చేస్తా.

రూప : అది కాదక్కా! నా కాశ్చర్యం వేసే దేమిటంటే ఒక్క మారు చూశావో లేదో వారి రూప రేఖా విలాసాలు – ఎలాగ హత్తుకున్నాయో నీ మనస్సులో! మొన్న వారి మిత్రుడు మైత్రేయుడు వచ్చి మహారాజులుంగారే ఎదుట ఉన్నట్టు తెల్లపోయాడు. "కల కల నవ్వినట్లు తెలికన్నుల నిక్కము చూచినట్లు" అన్నట్లుంది. అక్కా ఈ పద్యం పింగళి సూరన్నగారిది కాదూ?

విలాసిని : అవునే. కాని, ఉషాకన్య చెలికత్తె చిత్రలేఖ మరీ గొప్పది కాదూ? కన్న వారివి కాక విన్నవారి బొమ్మలనే వ్రాసి చూపించింది. రూపా! మహారాజులుంగారిని అదివరకే నేను దర్శించాను.

రూప : అ దెప్పు డమ్మోయ్!

విలాసిని : కలలో! వసంత పంచమినాటి తెల్లవారగట్ల నాకు స్వప్నం వచ్చిందే – సరిగ్గా ఉషాదేవికి వచ్చినట్లే!

రూప : "అవల ఏమేమొ చేసె, అయ్యాగడమ్మ – ఏమి చెప్పుదు, సిగ్గు నోరెత్త నీదు" అన్నదాకా వచ్చిందా?

విలాసిని : (విలాసంగా) ఛీ! ఊరుకో! అదివరకే వారి దర్శనం అయింది. కనకనే మొన్న ఉత్సవంలో వారు వేంచేయగానే అనిరుద్ధ చరిత్రలో ఆ పద్యం మొదట చదివాను. చదువుతూ చదువుతూనే మనస్సులో ఆ పదం కట్టుకున్నాను.

రూప : ఎంత చక్కని పదమే అక్కా! ఆ పదం నీవు అభినయించలేదు తెలుసునా? అనుభవించావు. కాలు చేతులకు కొంచెం వణుకు, కంఠరవంలో ఆవేదనా, కళ్లల్లో వెలుగునీడలూ నేనూ, అమ్మా, మైత్రేయుడూ అన్నీ చూస్తూనే ఉన్నాము. మహారాజులుంగారి వైఖరి చూసి అమ్మ అందలం ఎక్కింది.

విలాసిని : అబ్బా! అలా మాట్లాడకే! నా మీద నాకే అసహ్యం వేస్తుంది. నా మనస్సు గాని, వారి మనస్సు గాని అమ్మ కేం తెలుస్తుంది? ఒకరి కళ్లూ, ఒకరి నోటా పడవలసిన అంగడి

అనురాగమా మాది? ఆ మైత్రేయుని చూపుల్లో వేశ్య అంటే ఎంత చులకన ఉన్నది! "పూత పసిండి వంటి వలపుం బచరించు కులమ్ము నీతికిన్ లేత కదా!" అనుకున్నాడు ఆ మూర్ఖ బ్రాహ్మణుడు. కులానికి లేత అయినా గుణంలో పూత మని అతగాడికి ఏం తెలుసును? రూపా, మృచ్ఛకటిక కథ నీకు చెప్పాను కాదే! వసంత సేన కన్న ఏ ఇల్లాలు పూజ్యురాలే? చెల్లీ, మహారాజుల మాట మామూలు ధోరణిలో ఎవరు నావద్ద ఎత్తినా ఎంతగా కుళ్లి ఏడుస్తున్నా నను కున్నావు?

రూప : అక్కా! నీ మనస్సు నాకు తెలియదను కున్నావా? నీకు అమ్మ గుణాలు ఏమీ రాలేదే! యౌవనంలో ఏ మహా పండితుని స్నేహం లభించిందో ఆమెకు! అక్కా! మహా ప్రభువులు వేంచేసే వేళ కావచ్చింది. ఇంకా ఇలా ఉన్నావేం?

విలాసిని : అదుగో రూపా! ఇంకా పెడతోవలోనే ఉన్నావే! వారి రాక కోసం నేనూ, ఈ మందిరమూ ఒకేలాగు ఎదురు చూస్తున్నాము. కొత్త అలంకారాలు ఏమీ అక్కరలేదు. తెచ్చుకోలు వలపులూ, పెట్టుకోలు అలంకారాలూ ఈ ఇంట మన అమ్మతోనే ఆగిపోయాయి. రూపా! నా వీణ మాత్రం ఇలాగ పెట్టు. నా మనస్సు పూర్తిగా గ్రహించిన దదే !

(వీణా వాద్యం అర నిముషం)

## 6

(మహారాజు ప్రాసాదానికి ఎదురుగా - రాత్రి)

**మైత్రేయుడు** : మహాప్రభూ! ఈ వేషాలు మనకు భేషుగ్గా కుదిరాయి. తమరు మైత్రేయుడిలా గున్నారు. మనం - మన్నించాలి మహారాజులాగున్నాము. నాకు ఊరికే ఏడుపొస్తుంది ప్రభూ!

**విజయరామ గజపతి** : ఎందుకయ్యా?

**మైత్రేయుడు** : మూడు కారణాలున్నాయి. 'అరరే కళింగ మహారాజులే, పూసపాటి గజపతులే, కాలి నడకను సందుగొందులందు వెళ్లవలసి వచ్చిందే 'అని ఒకటి, 'శ్రీ శ్రీ శ్రీ మహారాణీ అమ్మగారికి తెలిస్తే ఈ భుజాల వద్ద నుంచి ఈ బుర్ర సెలవు పుచ్చుకోవాలే' అని రెండూ, 'ఇంక మహారాజు వేషం వేసిన ఈ మైత్రేయుడి మీద ఆ ముసలి పీనుగు సింహాచలానికి మమత కలగదేమో' అని మూడు!

**విజయరామ గజపతి** : మూడూ సరియైన కారణాలు కావు. సకల కళానిధి సందర్శనానికి వెళ్లేటప్పుడు కళింగ గజపతి అయినా కాలినడకను వెళ్లవలసిందే. నీ బుద్ధి నీ బుర్రలోనే లేదు కనుక, అది ఎగిరిపోయినా ఫరవాలేదు. ఇక సింహాచలం సంగతి. మీ ఇద్దరికీ ఈడూ జోడే.. వార్థకం వచ్చిందే అని భయపడనక్కరలేదు. మదన దేవుడు తలచుకుంటే హేమంతంలో వాసంత లావణ్యం మొలకెత్తుతుంది.

ముదుక మామిడి మొల్లముగుద కౌగిట ద్రోసి
తరపి ప్రాయంపు తొందరల రేపు

వసివాడు పెదవుల కొసలపై కిసలయ
　　చ్ఛవులు మాకంద మధువులు చిలుకు
దరిలేని కాదారి దారి పున్నమి రేల
　　వెన్నెల దివిటీల వెలుగు నింపు
చిదికి చిల్లులు పోవు నెద నదుకులు లేని
　　చిన్ని పూదేనియ దొన్నెచేయు
అతడు మన ఇలవేల్పు, దయారసాంబు
రాశి, నిఖిల ప్రపంచ సంరక్షకుండు
వెడలు నీ తోడు నీడయై వెంట వెంట
తుంట విలుకాడు దిగువని వింటి వాడు!

మైత్రేయుడు : భేష్ మహాప్రభూ! ఆ ధీమా ఇస్తే ఇకనేం? కదులుదాం పదండి. అయినా తోవలో నా మీద ఒక కన్ను వేసి ఉంచండి. బొత్తిగా అదే పనిగా ఊపిరాడ నీయకుండా ఉక్కిరి బిక్కిరిగా నా మీద పూలబాణాలు వెయ్యనీయకండి.

విజయరామ గజపతి : ఏమి రాత్రి ఇది! మైత్రేయా, చంద్రాస్తమయం కావడం వల్ల కాబోలు - ఈ రాత్రి ఎలాగ నిట్టూరుస్తుందో చూస్తున్నావా? మహా మంచి ముహూర్తంలో బయలుదేరుతున్నాం.

విరిసిన మల్లె యత్తరుల మేన నలంది
　　కొని వీథి చొరబడె కోడెగాలి
గుసగుసలాడు దాగుని సోరణము వెన్క
　　తాపికత్తియ వోలె తలిరు తీవ
నీలి చీకటుల గుమ్మాల నక్కిన చుక్క
　　ప్రియునికై సారె సారెకును జూచు
చివురు మెత్తని పాన్పు సవరించి ఉను రున్ను
　　రని, దాన పొరలాడు నన విరహిణి

అంప పొది దింపుకొని వంజు లారవింద
మంజు లామ్ర నీలోత్పల మల్లికాళి
వెడలె వెడవిల్తుడీ పురవీథి వెంట
చిలుక తేరెక్కి భ్రమర శింజినులు మొరయ!

పద! మైత్రేయా! పోదాం!

(ఎవరైనా వీథులంట తొందరగా నడిచే ధోరణి స్ఫురింప జేసే అడుగుల చప్పుడు, అడగి మడగి అనుకూల వాద్యగానం)

మైత్రేయుడు : అదు గదుగో మహాప్రభూ, ఆ వీథి మొగనున్న పెద్ద మేడే శ్రీ శ్రీ శ్రీ విలాసినీ దేవి అమ్మగారిది. హద్దీ, హద్దీ, హద్దీ, ఆ గుమ్మం దగ్గర జయ విజయుల్లాగ నిలబడ్డా రిద్దరూ ఎవరో చెప్పుకోండి!

విజయరామ గజపతి : నీవు చెప్పు –

మైత్రేయుడు : సింహాచలం, వెంకట గిరి.

విజయరామ గజపతి : అంటే?

మైత్రేయుడు : అమ్మగారి అమ్మగారూ, పెద్దమ్మ గారూ. ఇక్కడ ఒక్క నిముషం ఆగి, కాస్త ఉత్సాహం బలం తెచ్చుకుందాం! ఏం? మహాప్రభూ! బాగా చదువుకున్నవారు తమరు. ఒక ప్రశ్న వేస్తా, సమాధానం దయ చేయించండి.

విజయరామ గజపతి : ఊఁ, అడుగు.

మైత్రేయుడు : వెంకటగిరీ, సింహాచలమూ కలిసి ఎన్ని?

విజయరామ గజపతి : అదేం ప్రశ్న? రెండు –

మైత్రేయుడు : కాదు – ఎనిమిది.

విజయరామ గజపతి : ఎలాగ?

మైత్రేయుడు : సింహాచలం ఒక కొండ - వెంకట గిరి ఏడుకొండలు - వెరసి ఎనిమిది. అనగా ఇద్దరిలో సింహాచలం సింహాచలమే. తెలిసి పోవడం లేదూ! కళ్లంటూ, సెలవులంటూ ఎన్నిధారలో చిత్తగించారా? ఇక మనం శ్రీ కూర్మంలాగ నెమ్మదిగా సమీపించాలి. పని జరిగాక ఉత్సాహంగా మంగళగిరిలాగా వచ్చెయ్యాలి.

విజయరామ గజపతి : నోరు ముయ్యి! ఊరుకో!

మైత్రేయుడు : అబ్బెబ్బే! మన్నించాలి. నేను పరమార్థం మనవి చేసుకుంటున్నాను. మన కిది గొప్ప పర్వదినం అంటాను.. మహాప్రభూ, ఒక్కసారి పుణ్యక్షేత్రాలు రెండూ సేవించుకుంటున్నాం. ఇక్కడ నుంచి మనకు దిన దినమూ దివ్యక్షేత్ర దర్శనం తప్పదు. ఓహోహో! ఓహోహో!

విజయరామ గజపతి : (నవ్వి) చాల్లే! నడూ ఇంక!

(మరొక పదం మందిరంలోంచి లాగ వినపడుతుంది)

# 7

(కొంచెం సేపు వాద్యగానం. మరొక క్షేత్రయ్యపదము. మందిరం లోనుంచి లాగ వినపడుతుంది. మహారాణి అంతిపురం)

రదనిక : అమ్మా! అంత బేలవైపోతే ఎలాగ?

మహారాణి : కాదులే, ఎన్నడైనా ఇలాగ జరుగుతుం దనుకున్నానా? రాచకార్యాలు కూడా మరిచి, అంతిపురాన్ని వదలని వారికి ఇదెక్కడ దాపురించిందే రదనికా! ఎందరో రాచ

కూతుళ్లని కాదని, కోరి నన్ను వరించామనీ ఇచ్చకాలు కూడాను! అంతఃపురంలో ఉన్నప్పుడు వారి చూపుల్లో, చేతల్లో ఎప్పుడూ అసత్యం కనపడలేదే నా కళ్లకి. ఎంత గుడ్డిదాన్నయాను! సాటి రాచకూతుళ్లనెలాగ చూస్తామే ఇలాగ అవమానాల పాలయి! (కొంచెం ఏడుస్తున్నట్టు)

రదనిక : తమ కవమానం ఏ ముందమ్మా!

మహారాణి : మమ్మల్ని ఎత్తి పొడిచినట్టుందే ఇది! రదనికా, ఆవిణ్ణి చూశావే నువ్వు! అంత చక్కనిదా? ఊరూ, వాడా దాని సోయగం కబుర్లే చెప్పుకుంటారట కాదూ! మొన్న మదనవల్లి చెప్పింది – కళ్లేవో చాలా బాగుంటాయట. చదువు కున్నదట. కిన్నెర పాటట. ఇప్పుడు అక్కడే ఉంటున్నారేమో. అయ్యయ్యో, నా తల వేడెక్కిపోతోందే! మహారాణి అంత చేతకానిదని చెప్పుకుంటున్నారా ఊరూ, వాడా? ఇప్పుడు అక్కడే ఉంటారు రదనికా, లేవవే, పో! తక్షణం నువ్వు విలాసిని ఇంటికి. ప్రచ్ఛన్నంగా వెళ్లి, ఈ ఒక్కరాత్రికైనా శ్రీవారు ఇక్కడికి వచ్చేటట్టు చేయమని ఆవిడతో మేం వేడుకున్నట్లు చెప్పవే!

రదనిక : అమ్మా! అమ్మా! ఎంత తప్పు! తమరేమిటి, దానికి ఈ వేడుకోలు పంపడ మేమిటి? తగదమ్మా ఈ యోచన!

మహారాణి : అలాగ అనకే రదనికా! అనురాగం కోసం ఏ అవమానం పడ్డా తప్పు లేదు. ఈ రాత్రి వారిని ఏ విధంగానైనా కంట చూడకుండా బతక లేనే! అయ్యో, రదనికా, ఇప్పుడు దాని

ఇంట్లో ఏ రాగాలూ, విలాసాలూ సాగుతున్నాయో! తొందరపడవే రదనికా!

రదనిక : అమ్మా, ఆ ఇంటికి నన్ను వెళ్లమంటారా?

మహారాణి : నీకేమే మహారాజులు వెళ్లిన చోటికి నీవు పోతే తప్పేమిటే? పోనీ రదనికా! మారువేషంలో నేను వెళ్లనా?

రదనిక : అమ్మా అమ్మా! తమ మనస్సు తిన్నగా లేదు. కాస్త తమరు తాళితే అన్నీ సర్దుకుంటాయి. వెడుతున్నానమ్మా ఇప్పుడే.

# 8

(విలాసిని మందిరంలో పాట)

విలాసిని :

ఎవ రిచ్చారే ఈ మరునకు విరితూపులు!
సన్నజాజి రేకుకన్న వెన్నెల వెన్నల కన్నా
అన్నుల మిన్నల మనసులు అతి మృదులములని తెలిసి
ఎవ రిచ్చారే ....
మావికొమ్మపైని చందమామ పొంచి చూచేనే
వీవలి మల్లియ పూవుల తావులూని వీచేనే
రమణీ మన్మథుడు విజయ రామ భూపాల మౌళి
రాడాయెనె, నా హృదయము పాడాయెనె ఓ చెలియా,
ఎవ రిచ్చారే ....

రూప : భేష్ భేష్ అక్కా! పాట బాగుంది. కాని, మళ్లీ నీకు కూడా మరు డంటావు, విరితూపు లంటావు. నాకేమో అర్థం కావడం లేదు.

విలాసిని : అదేమో రూపా, అనురాగం లేదన్నానా? సుఖాలు వద్దన్నానా? సామాన్య వేశ్యల పూాత వలపులు నాకు దుస్సహం అన్నాను. కాని –

రూప : మొన్న శ్రీవారు వేంచేసినపుడు – అదేం ధోరణో మీ ఇద్దరిదీ! వారు ఆ పీఠం మీద మౌనంగా కూర్చున్నారు. ఈ మూల నీవు మౌనంగా నిలబడ్డావు. వారు పెదవి విప్ప లేదు. నీవు ఊఁ అనలేదు. మైత్రేయుడు మాత్రం ఇప్పుడూ అప్పుడూ కాస్త ఓంద్ర పెట్టబోయి అవతలకు పోయాడు. అతగాడితో అందరమూ పోయాం. తరవాత ఏమైందో?

విలాసిని : తరవాతా అంతే (తలుపు కొట్టిన చప్పుడు) ఎవ రదీ?

ఆడగొంతు : ఎవరో నమ్మా! మిమ్మల్ని చూడడానికి వచ్చారు. తొందరగా చూడాలట రాచదాసీ లాగుంది.

విలాసిని : వెంటనే రమ్మను... ఎవరు చెప్మా.. ఆఁ రండమ్మా! ఇక్కడ ఇలా కూచోండి. ఎవరమ్మా మీరు?

రదనిక : ఎవరైతేనేం? ఎవరో చెప్పుకుంటే సిగ్గు, చెప్పకపోతే పని కాదు.

విలాసిని : అలాగయితే చెప్పండి.

రదనిక : ఒక మాట ఇస్తే చెప్తా. విలాసిని ఎంత చక్కనిదో అంత సుగుణాల పుట్ట అని పట్టణమంతా చెప్పుకుంటారు. అంతే కాక, గొప్ప వాళ్లతో స్నేహం కుదిరిన వాళ్లకి, గొప్ప వాళ్ల రహస్యాలు కాపాడడమూ

తెలిసుంటుంది. నేనెవరో చెప్తా. నా కార్యం ఫలించినా ఫలించకపోయినా నారాక మాత్రం రహస్యంగా ఉంచాలి.

విలాసిని : అయ్యో, అమ్మా! అలాగే! చెప్పండి తొందరగా!

రదనిక : అంత తొంద రెందుకు? ఎవరికోసమైనా ఎదురు చూస్తున్నారా!

విలాసిని : అవును.

రదనిక : మీకోసం వచ్చేవారు ఏ మహారాజులో అయి ఉంటారు.

విలాసిని : చెప్పండమ్మా

రదనిక : వినమ్మా విలాసినీ! నేను శ్రీ మహారాణీ అమ్మవారి దాసీని. నన్ను రదనిక అంటారు. శ్రీ వారే పంపితే వచ్చాను.

విలాసిని : మహారాజులుంగారా?

రదనిక : మహారాణీ వారు. మహారాజులుంగారు వార్త పంపడ మెందుకు? వారే ఇక్కడికి వేంచేస్తారాయె. అమ్మా, విలాసినీ, మహారాణీ దేవిగారు మంచం పట్టి, శుష్కిస్తున్నారు. ఇది న్యాయం కాదని చెప్పమన్నారు. నిన్న మొన్నటి దాకా తలలో నాలుకలాగా ఉన్న తమ నాథుల్ని ఇలాగ కైవసం చేసుకుని, వారి సంసార సుఖం భగ్నం చేయడం ధర్మం కాదన్నారు. అమ్మా, చదువుకున్న దానవు. ధర్మాలన్నీ తెలిసిన ఏ మహా పండితుని రక్తం నీలో ప్రవహిస్తోందో! శాపం వల్ల ఈ కులంలో పుట్టావు. పొరపాటున ఈ దోషం చేస్తున్నావు. శ్రీ వారు కళింగ

మహారాజులూ, పూసపాటి గజపతులూ అన్న మాట మరిచిపోకమ్మా. మహా ప్రభువులు ఇక్కడకు వేంచేయగానే, కాదని చెప్పి, వారిని అంతఃపురంలోకి పంపివెయ్యి తల్లీ!

విలాసిని : ఎంత దీర్ఘంగా చెప్పారమ్మా! కాని మీకు సత్యమూ తెలియదు, ఈ విలాసిని సంగతీ తెలియదు. మహారాజుల్ని ఎవ్వరూ ఈ ఇంటికి రమ్మని బలవంత పెట్టి ఆహ్వానించ లేదు. వారయినా ఇక్కడికి సామాన్య విటులుగా రాలేదు. శ్రీవారి మనస్సు గ్రహించే శక్తి కలవారే అయితే మీ అమ్మగారు ఈ రాయబారమే పంపక పోదురు. మీ రెంత క్రూరంగా మాటాడేరో మీకే తెలియదు. దయ చేయండమ్మా! తమ స్వాముల్ని అంతఃపురం దాటకుండా కట్టుకునే బాధ్యత మహారాణీ వారిదేనని మనవి చెయ్యండి.

రదనిక : అంతేనా, వెళ్లనా అమ్మా?

విలాసని : ఉండండి. ఈ కానుక విలాసిని పంపుకున్నదని వారికి అందజేయండి. ఒక్క నిముషం ఆగండి. (నిశ్శబ్దం)

రదనిక : వెళ్లివస్తా విలాసినీ!

విలాసిని : మంచిది. (తలుపు వేసిన చప్పుడు)

రూప : అక్కా, ఎంత గర్వంగా మాట్లాడతావు? అక్కా, మహారాజుల చిత్రపటం ఇచ్చేశావేం?

విలాసిని : మనకు చిత్రపటం ఎందుకే? అయినా అది అక్కడే ఉంటే, ఎప్పుడైనా వియోగం వచ్చినప్పుడు శ్రీ వారికి అది నన్ను జ్ఞాపకం చేస్తూ ఉంటుంది.

రూప : అలా మాట్లాడ కక్కా! దాని వెనక ఏదో ప్రాశావేమిటి?

విలాసిని : పద్యం

రూప : ఏదీ, అక్కా?

విలాసిని : చదవనా?

ఏ వనితల్ మముం దలప నేమి వనో!
తమ రాడు వారు కా
రో, వలపింప నేర్పెరుగరో!
తమ కౌగిలిలోనె యుండగా
"రా విది యేలరా విజయ రాఘవ
రామ నృపాల" యంచునే
తీవరకత్తెనె ఇటకు తీసుకు
వచ్చితినో తలోదరీ! *

రూప : అక్కా, నీకు ముద్దు పెట్టనా, నమస్కారం పెట్టనా?

విలాసిని : ఎప్పుడూ మొదటిదే

## 9

(రాజ మందిరం దగ్గర)

వసంతుడు : ఏం మైత్రేయా, అంత తొందరగా ఎగిరి పోతున్నావు పక్షిలాగ?

మైత్రేయుడు : ఆఁ! ఎగిరినా ఎగురుతాము. ఈ మన్మ థోత్సవము ముగిసేటప్పటికి పక్షినీ కావచ్చు, తుమ్మెదనీ కావచ్చు. అమ్మమ్మా, అమ్మమ్మా! ఏమి కొడుతున్నాడోయ్! ఏమి లోకు వయామోయ్!

రంగాజమ్మ రచించిన చాటువు

వసంతుడు : ఎవరు ఎవరిని?

మైత్రేయుడు : ఎవరు ఎవర్ని? మన్మథుడూ, మన్నీ– చూడు ఈ ఒళ్లు వాసన చూడూ! పూవులు తగిలి తగిలీ అత్తరు వర్తకుడు లాగ పరిమళించి పోతున్నాను. ఇదిగో కడుపు మీద నల్ల కలువలు, వీపుమీద నవ మల్లికలు, నసాళం మీద అశోకాలు, పృష్ఠాల మీద అరవిందాలు, అడపా తడపా మావి పూవులు, అప్పటికీ మనం తెలివైన వాళ్లం కనక, ఇదుగో ఈ సరంజాం తయారు చేసుకున్నాం.

వసంతుడు : ఇవేమిటోయ్?

మైత్రేయుడు : కవచం, డాలు! చస్తున్నాడు మన్మథుడు. మనం దొరకటం లేదు వాడికి. ఇటొస్తే అటూ, అటొస్తే ఇటూ ఊరికే ఉప్పట్టే ఆడేస్తున్నా. మొదటనే భగవంతుడు ఒక గొప్ప పొరపాటు చేశాడోయ్! దాని వల్ల ఈ ముప్పు వచ్చింది.

వసంతుడు : ఏమిటది?

మైత్రేయుడు : మన్మథుడికి శరీరం లేకుండా చేయడం. మనిషిలాగ కంటికి కనపడితే మరి దొరుకు తామా? ఇప్పుడో? ఒక్కటే బెదురు. అరే అమ్మయ్యోయ్ దూకు. ఇటు దూకు. ఆఁ అలాగ. ఎందుకో తెలుసా? అదిగో అక్కడ చిలక వాలింది. దాని వీపు మీద తిరా వాడుంటే? ఇటూ ఇటూ, దూకూ, అటు పువ్వులు రాల్తున్నాయి. వాడే విసిరిన వేమో!

వేసి, అఘదూషితమైన శరీరమే విసర్జించింది. ఆ గడియలో ఆమెలో ప్రణయానికీ, సౌశీల్యానికీ ఎంత ఘర్షణ జరిగిందో పాపం! విలాసిని మరణించింది. మహారాజు మరణం వంటి మౌనముద్రలో పడి, కాశీయాత్రకు బయలుదేరారు. ... ఎవరో హా అది? వసంతా, రదనికా, ఎవరయ్యా అది? ఇదిగో ఇక్కడ ఈ మైత్రేయుడు పిలుస్తున్నాడు. విన్నారా? విలాసిని వెళ్ళిపోయింది. పాప పుణ్యాలకూ, సుఖ దుఃఖాలకూ అతీతమైన సీమకు. పార్వతీశ్వరుడు నాడు కామదహనం మాత్రం చేయగలిగాడు. పడుపు పడతి నేడు కామ బాణ దహనమే చేసింది. ఇట్టిది మానవ చరిత్రలో ఎన్నడూ జరగనే లేదు. ఆహా! వసంతా, పైకి చూడు. అదిగో ఆ కొత్త నక్షత్రం వజ్రంలాగ మెరుస్తున్నది, ఆ విలాసినే! ఈ చందన కాష్ఠం నుంచి రేగి వచ్చే ధూమాల్లో చీకట్లలో చిక్కని నీడల లాగ నీవూ, నేనూను. రా, మనమూ వేద్దాము – ఈ చితిలో ఒక మదన సాయకము!